LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    సంపుటి : 71    సంచిక : 44    3.11.2000    శుక్రవారం    12 పేజీలు    విడిప్రతి : రూ.2.00లు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# చంద్రబాబుకు క్రమ్మిన చైనా మైకం!

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గత వారం పదిరోజులుగా ఎక్కడే సభ జరిగినా ఏ సమావేశంలో మాట్లాడినా చైనా దేశం గురించి మాట్లాడుతున్నారు. వారి తిండి వారి వేషభాషలు, వారి నగరాలలోని భవనాలు, అభివృద్ధి పనితీరు సర్వం వర్ణించి, కథలు కథలుగా విన్పిస్తున్నాడు. చివరకు వారు త్రాగే 'గ్రీన్‌టీ' గురించి సైతం కొత్త సిద్ధాంతాలు ప్రతిపాదిస్తున్నాడు. గ్రీన్‌టీ త్రాగినందువల్లే చైనాలో గుండె జబ్బులు లేవన్నది ఆయన కనిపెట్టిన సత్యం.



వి.ఆర్. కాలేజిలో ఒకటైన రాజకీయ ప్రత్యర్థులు - జనార్ధనరెడ్డి, వెంకయ్య నాయుడు.

చైనాలో గ్రీన్ టీ త్రాగుతారని తెలియని వారు భారతదేశంలో లేరు. కొంచెం ప్రపంచ జ్ఞానం కల్గిన వారందరికీ తెలిసిన విషయమే అది. దాన్ని తెలుసుకోవడానికి ముఖ్యమంత్రి అన్ని కోట్లు ఖర్చుపెట్టి ఆ దేశం పర్యటించిరావలసిన అవసరం లేదు కదా?

చైనా ఆర్థిక సంస్కరణలు అమలు తీరును తాను అనుసరించబోతున్నట్లు పదే పదే చెప్తున్నారాయన. ఆయన ఎప్పుడు ఏ దేశం వెళ్లినా ఆ దేశం గురించి బలవలు పలవలు చెప్తూ కొన్ని నెలల పాటు కాలక్షేపం చేయడం మామూలే. గతంలో మలేషియా, సింగపూర్, అమెరికా పర్యటనలప్పుడు చేసిందీ అదే. రేపు మరొక కొత్త దేశం వెళ్లేంత వరకు మనం ఈ చైనా గోల వినక తప్పేట్లు లేదు.

చైనా చరిత్ర, భౌగోళిక స్వరూపం, రాజకీయ వ్యవస్థ, ప్రజల జీవన విధానం వంటివి మనకు పూర్తి విరుద్ధమైనవి. 50 ఏళ్ల క్రితం వరకు రాచరిక పాలనలో వుండిన దేశమిది. ఇప్పుడు కమ్యూనిస్టు నియంతృత్వంలో మ్రగ్గుతున్నది. విదేశాల నుంచి వచ్చే వారు అక్కడి ప్రభుత్వాధికారులు చూపించిన ప్రదేశాలు తప్ప ఇతర చోట్లకు వెళ్లడానికి లేదు; ఇతరులతో మాట్లాడడానికి లేదు. స్వదేశంలో ఏ చిన్న పాటి నిరసన, ప్రభుత్వ వ్యతిరేకత సహించరు. తియాన్మెన్‌స్క్వేర్ సంఘటన గుర్తుండే వారు చైనా గురించి మాట్లాడరు. ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమం జరిపినందుకు కొన్ని వేల మంది విద్యార్థులను సైనిక ట్యాంకుల క్రింద పడవేసి, త్రొక్కించి చంపిన నిరంకుశ క్రూరపాలకులు వారు. ఆ శవాలను గుట్టలు పోసి కాల్చారు.

షాంగాయ్ సిటీలో మురికివాడల పట్ల బహుళ జాతి సంస్థలు అభ్యంతరం చెప్పినప్పుడు; సిటీలో పౌర జీవితం మెరుగుపడకుంటే తాము కొత్త పెట్టుబడులు పెట్టలేమని బెదరించినప్పుడు - చైనా పాలకులు వ్యవహరించిన తీరు ప్రపంచ చరిత్రలోనే మాయని మచ్చగా పేరు పడింది. కొన్ని లక్షల మంది పేద పౌరులను

తరువ 12వ పేజీలో

# స్కాంపి రొయ్యలు రైతునెక్కడికి నడిపించబోతున్నాయి!

నెల్లూరు జిల్లా వ్యవసాయ రంగ ముఖచిత్రం ఉన్నట్లుండి మారిపోతున్నది. నిశ్శబ్ద విప్లవం రూపుదిద్దుకొంటున్నది. కొన్ని వందలు, వేల సంవత్సరాలుగా వరిసాగుపై ఆధారపడిన రైతాంగం - ఇప్పుడా పంట పేరు చెప్తే ముఖం చిట్లిస్తున్నది. ఒకే ఒక్క సంవత్సరంలో వూహించని మార్పులు వచ్చేస్తున్నాయి. ఆ రాకలోనూ శరవేగం!

ఏ గ్రామానికి వెళ్లినా, ఏ రైతును పలుకరించినా ఇప్పుడు వినవచ్చే ప్రస్తావన ఒకటే ఒకటి - అది స్కాంపి రొయ్యలు! అరెకరా రైతు నుంచి వంద లెకరాలున్న భూస్వామ్య కుటుంబాల వరకు ఎవరిని కదిలించినా ఇదే చర్చ, ఇదే రచ్చ. చివరకు డి ఫారం పట్టాలు కల్గిన పేద వ్యవసాయ కూలీలకు కూడా ఈ పూనకం ఆవరించి వుంది. ఇందుకూరుపేట, కోవూరు, బుచ్చిరెడ్డిపాళెం, తోటపల్లిగూడూరు వంటి డెల్టా ప్రాంతాలే కాదు - రాపూరు, వింజమూరు, నాయుడుపేట వంటి మెట్ట ప్రాంతాలలోనూ రాత్రికి రాత్రి పంట పొలాలు రొయ్యల చెరువులుగా మారిపోతున్నాయి. జిల్లాలో ఇప్పటికే దాదాపు 50 వేల ఎకరాలు రూపం మార్చుకున్నాయి. మరొక రెండు మూడు నెలల్లో అది లక్ష ఎకరాలకు చేరుకున్నా ఆశ్చర్యం లేదు. ఎకరా లక్ష రూపాయలకు పైన విలువ చేసే భూమిని సైతం నిస్సంకోచంగా చెరువు క్రింద మార్చేస్తున్నారు రైతులు.

> సాగు విస్తీర్ణం లక్ష ఎకరాలు దాటుతున్నది; ఆశలు కోటలు దాటుతున్నాయి; వాస్తవం ఏమిటన్నదే ప్రశ్న!

వీరిలో ఇంతటి ఉత్సాహానికి కారణం - రొయ్యల సాగులో వరి, చెరకు వంటి సాంప్రదాయ వ్యవసాయం కంటే అధిక లాభాలు కనిపించడం. నిజానికి మంచినీటి రొయ్యల పెంపకం జిల్లాలో ఎప్పుడో పదిహేనేళ్ల క్రితమే ప్రవేశించింది. అక్కడక్కడా కొందరు రైతులు అప్పటి నుంచి దానిని కొనసాగిస్తున్నారు. కాని ఇటీవల అంతర్జాతీయ మార్కెట్‌లో రొయ్యల ధరలు అపరిమితంగా పెరిగిపోవడం; వాటి సాగుకు కావలసిన పిల్లలు ఉత్పత్తి చేసే హేచరీలు; మేత సరఫరా; మందు మాకుల లభ్యత పెరగడంతో రైతులందరూ ఉలిక్కిపడి నిద్రలేచిన వారి వలె వాటిపట్ల ఆకర్షితులౌతున్నారు. ఉప్పునీటి రొయ్యల వలె వీటికి వైరస్ తెగుళ్లు లేవన్న భరోసా; మినిమం గ్యారంటీ వుంటుందన్న నమ్మకం; పెద్దగా పెట్టుబడి అవసరం లేకుండా తమ భూములనే వాడుకొనే వసతి, కూలీలపై ఆధారపడనవసరం లేని వ్యాపకం కావడంతో చిన్న చిన్న రైతులూ ఉత్సాహంగా ముందుకు దూకుతున్నారు. ఒకర్ని చూసి మరొకరు పోటీలు పడుతున్నారు. రొయ్యల సాగు చేపట్టని రైతు అంటే - చేతగాని దద్దమ్మగా పరిగణింపబడే వాతావరణం ఏర్పడి పోతున్నది గ్రామాలలో!

రైతాంగం కేవలం సాంప్రదాయ పద్ధతుల్లోనే నడవకుండా కొత్త ఆదాయ మార్గాలవైపు దృష్టి మళ్లించడం మంచిదే. డబ్ల్యుటిఓ ఒప్పందం గొంతు మీద కత్తివలె భయపెడుతున్న అంతర్జాతీయ లిబరలైజేషన్ వ్యవస్థలో ఎక్కడ లాభం వుందో అక్కడ పనిచేయనివాడు ఎందుకూ కొరగాని శుంఠ అయిపోతాడు. ఫుడ్ సెక్యూరిటీ వంటి పడికట్టు పదాలకు ఇప్పుడు విలువ లేదు. ప్రతిదీ డబ్బిచ్చి కొనడమే నేటి ప్రపంచ మార్కెట్ సిద్ధాంతం. డబ్బు సృష్టి ఒక్కటే తారకమంత్రం. అందువల్ల రైతులు

తరువ 12వ పేజీలో

## నెల్లూరులో వెంకయ్యనాయుడు పర్యటన

# స్వంతపార్టీలో నిర్లిప్తత : అభిమానుల్లో ఆనందోత్సాహం!

వెంకయ్యనాయుడు ఢిల్లీ నుంచి బయల్దేరబోయే ముందు ప్రధాని వాజ్‌పాయిని కలిసి, ఆంధ్రరాష్ట్రానికి వెళ్తున్నానని, తన వెంట మరి ఇద్దరు మంత్రులను తీసుకొని వెళ్తున్నానని చెప్పారట; ఎందుకు? - అని ప్రధాని ప్రశ్నిస్తే - పల్లెలు చూపించడానికి, పల్లెల్లో తిరగడానికి అని సమాధాన మిచ్చారట.

## భిన్నధృవాల అపూర్వ సంగమం
## పూర్వ విద్యార్థుల సన్మానం

కాని ఆయన రెండు రోజుల పర్యటనలో పల్లెల్లో గడిపింది అర పూట మాత్రం; తతిమా ఒకటిన్నర దినం నెల్లూరు టౌన్‌లో తిరగడానికే సరిపోయింది. జిల్లా అధికారులు వెంకయ్య నాయుడికి వూపిరి పీల్చుకొనే వ్యవధి ఇవ్వనంతగా కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. కలెక్టర్ గారైతే ఈ పర్యటన పట్ల స్పెషల్ ఇంట్రస్ట్ ప్రదర్శించారు. నాలుగు రోజులు ముందుగా హైదరాబాదుకు వెళ్లి, నాయుడ్ని గారిని స్వయంగా కలిసి, నెల్లూరుకు అడ్వాన్సు స్వాగతం పలికారు. సాధారణంగా జిల్లా అధికార్లు రాష్ట్రమంత్రులు, ముఖ్యమంత్రులకే ప్రాధాన్యత ఇస్తారు తప్ప కేంద్ర మంత్రుల విషయంలోనూ పెద్దగా చొరవ చూపరు. బందో బస్తు విషయంలో ఎస్‌పిగారు విశేష ఆసక్తి ప్రదర్శించడం గమనార్హం. ముఖ్యమంత్రులు, ప్రధాన మంత్రులకు జరిపే రీతిలో కాన్వాయ్ రిహార్సల్స్ జరిపించారు. వెంకయ్య నాయుడు, నెల్లూరు తన స్వంత వూరు కాబట్టి దడబడలు, దర్ప ప్రదర్శనలు లేకుండా సింపుల్‌గా తిరగాలనుకున్నట్లుంది; అందువల్లే క్యాబినెట్ మినిస్టర్ స్థాయి సెక్యూరిటీ సిబ్బందిని ఢిల్లీలోనే వదలిపెట్టి, వంటరిగా హెలికాప్టర్ దిగాడు. కనీసం ఒక బాడీగార్డును కూడా ప్రక్కన వుంచుకోలేదు. అయితే నెల్లూరు పోలీసుల అత్యుత్సాహం వల్ల ఆ సింప్లిసిటీ మరుగునపడిపోయింది. వివిపి సెక్యూరిటీలో ఏ మాత్రం అనుభవం లేని స్థానిక పోలీసులు మంత్రి చుట్టూ వలయంగా ఏర్పడి, మంత్రిని కలవడానికి వచ్చిన వారిని చీకాకు పరిచారు. ట్రాఫిక్ నియంత్రణ పేరుతో సామాన్య పౌరులను చులకనగా చూశారు. వెంకయ్య నాయుడు గారు ఈ అధికారుల మెహర్బాని మరొకసారి పునరావృతం కాకుండా చూసుకొంటే గౌరవం.

***

నెల్లూరు టౌన్‌లో వెంకయ్య నాయుడి గారి తొలి కార్యక్రమం - పురవీధుల్లో ప్రదర్శన. కనుమూరు నుంచి 31తేది సాయంత్రం 4గంటలకు హెలికాప్టర్ దిగి, ఆర్అండ్‌బి గెస్ట్ హౌస్‌లో ఫ్రెష్ అప్ అయ్యి వూరేగింపుకు లారీ ఎక్కాడు. ఎందువల్లనో జిల్లా బిజెపి నేతలు ఈ ప్రదర్శన పట్ల అంతగా ఆసక్తి చూపినట్లు లేదు. దానికి తగినట్లే వుంటుందది. తర్వాత నర్తకి సెంటర్‌లో జరిగిన బహిరంగ సభ సైతం అంతేముగ్గురు కేంద్ర మంత్రులు పాల్గొనే సభను 'నర్తకి సెంటర్'లో ఏర్పాటు చేయడమే స్థాయి తక్కువ వ్యవహారం; ఆ చిన్న సభనూ అయోమయంగా జరపడం మరీ అవమానకరం. జిల్లా బిజెపితో వెంకయ్య నాయుడిగారికి సంబంధాలు లేవా? అనే సందేహం కల్గింది అది చూసిన తర్వాత! ఆ సందేహం నిజమో కాదో మాకు తెలియదు. వారు నిర్లిప్తంగా వ్యవహరించారన్నది మాత్రం నిజం.

ఈ సభకు ముందుగా ప్రదర్శన మధ్యలోనే వెంకయ్య నాయుడు గారు బిజెపి కార్యాలయం సందర్శించారు. బెంగుళూరు రియల్‌ఎస్టేట్ వ్యాపారంలో పేరు పొందిన నెల్లూరీయుడు రాఘవరెడ్డి



వి.ఆర్. కాలేజి పూర్వ విద్యార్థుల సత్కార సభలో ప్రసంగిస్తున్న పారిశ్రామిక వేత్త జి.వి.కె., గెయిల్ ఛైర్మన్ సి.ఆర్. ప్రసాద్; రామనారాయణరెడ్డి, వివేక, వెంకయ్య నాయుడు, జనార్దన రెడ్డి, ఆనం భక్తవత్సల రెడ్డి.

బిజెపి ఆఫీసు ప్రక్కనే నిర్మించిన 'హోటల్ మౌర్య'కు రిబ్బను కత్తిరించారు.

సభకు జిల్లా బిజెపి అధ్యక్షుడు రంగినేని కృష్ణయ్య అధ్యక్షత వహించారు. బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు చిలకం రామచంద్రారెడ్డి మాట్లాడుతూ వెంకయ్యకు మంత్రిత్వం వచ్చిన శుభ సందర్భానికి గుర్తుగా, జిల్లాలో బిజెపిని

## జిల్లా అధికారుల అత్యుత్సాహం అవసరమా?

ప్రథమ స్థానంలో నిలపాలని కార్యకర్తలకు సూచించారు. కేంద్ర పర్యాటక శాఖ మంత్రి అనంతకుమార్ వచ్చీరాని తెలుగులో మాట్లాడుతూ - ఎన్నిసార్లు పిలిచి వెంకయ్య నాయుడ్ని మంత్రి పదవి తీసుకోమన్నా పార్టీ ముందు - అధికారం తర్వాత అని సున్నితంగా త్రోసిపుచ్చేవారు. దక్షిణాది రాష్ట్రాల్లో బిజెపి పెరగడానికి వెంకయ్య నాయుడి కృషే కారణం అన్నారు. కేంద్ర సమాచార ప్రసార శాఖ మంత్రి సుష్మాస్వరాజ్ మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్ రాజకీయ కేంద్రం నెల్లూరు జిల్లా. పొట్టిశ్రీరాములు, పుచ్చలపల్లి సుందరయ్య, గోపాలరెడ్డి, జనార్దనరెడ్డి, బాబుల్‌రెడ్డి, తిక్కవరపు సుబ్బరామిరెడ్డి, మాగుంట సుబ్బరామిరెడ్డి వంటి నేతలకు జన్మనిచ్చిన జిల్లా. ఇటువంటి జిల్లాలో పుట్టిన సామాన్య రైతు బిడ్డ స్వశక్తితో కేంద్ర మంత్రి కావడం సామాన్య విషయం కాదన్నారు. పర్యటనలో ప్రజల స్పందన చూస్తుంటే ప్రతి ఒక్కరూ తమ స్వంత ఇంటిలోని వ్యక్తికి పదవి వచ్చినట్లు భావిస్తున్నట్లుంది - అన్నారామె. వెంకయ్య నాయుడి ఉపన్యాసం అనర్గళంగాసాగింది. నేను చవటపాళెంలో పుట్టి, మంగళగుంటలో తిరిగి, కనుమూరులో నడిచి, నెల్లూరులో ఎదిగి, ఉదయగిరిలో గెల్చాను. నా కుటుంబానికి రాజకీయ చరిత్ర లేదు. నేను సామాన్య రైతు బిడ్డను. బిజెపి నాకు తల్లి వంటిది. నన్ను పెంచి పోషించి ఇంత వాడ్ని చేసింది. ఆనం వెంకటరెడ్డి, ధనెంకుల నరసింహం, జి.సి.కొండయ్య, పుచ్చలపల్లి సుందరయ్యల నుంచి ఎన్నో నేర్చుకొన్నాను. నేను మంత్రిని కావాలని ఏనాడూ కోరలేదు. వాజ్‌పాయి వత్తిడికి తలవంచి పదవి స్వీకరించక తప్పలేదు. రాజకీయం వేరు, పరిపాలన వేరు. గ్రామీణాభివృద్ధి శాఖలో అంశాలన్నింటినీ అధ్యయనం చేస్తున్నాను. నెల్లూరుకు సమ్మర్ స్టోరేజి ట్యాంకు, బైపాసు రోడ్డు, వాటర్ స్కీంకు నిధులు, పెన్నాపై రెండవ వంతెన, సోమశిలకు అదనపు నిధులు, ఇఫ్కో ఫ్యాక్టరీ, కృష్ణపట్నం పోర్టును సాధించేందుకు కృషి చేస్తానన్నారు. వాగ్దానాలు చేయడం మంత్రులైన వారికి మంచినీళ్ల ప్రాయం; వెంకయ్య నాయుడు ఇప్పుడు మంత్రే కదా- వాగ్దానాల వర్షం కురిపించడంలో విశేషం ఏమి వుంది? వీటిలో ఏ ఒక్కటైనా చేసి చూపిస్తేనే ఫలితం! బిజెపి నాయకులు ఎమ్మెల్యే వెంకటస్వామి, వరదయ్య, సురేష్‌రెడ్డి, బాలకొండయ్య, పద్మజా దయాకర్, ఆచార్య ఆదిత్య వేదికపై ఆసీనులయ్యారు.

తొలిరోజుకు ఇదే చివరి కార్యక్రమం; జనం నుంచి అర్జీల స్వీకారంతో రెండవ రోజు ప్రారంభమైంది. జనాన్ని అర్జీలిమ్మంటే ఇళ్ల స్థలాలు; రేషన్‌కార్డులు అడుగుతారు; అవి కేంద్రమంత్రి పరిధిలోనివి కావు. అందరు రాజకీయవాదుల వలె ఆయనా ఈ పబ్లిసిటీ స్టంట్‌కు పాల్పడకుండా వుంటే బాగుండేది.

## కేకలు, ఆధిపత్య పోరులో
## మున్సిపల్ 'పౌర' సన్మానం

గ్రామాణాభివృద్ధి మంత్రిగా గ్రామాలకు వెళ్లి, గ్రామ సమస్యలను అధ్యయనం చేస్తే ఉపయోగం; అర్జీలతో ఏమి ప్రయోజనం?

తర్వాత రైస్ మిల్లర్స్ అసోసియేషన్ సన్మానం; కొండాయపాళెం గ్రామంలో అత్యంత చిత్తశుద్ధితో, నిరాడంబరతతో, నిశ్శబ్దంగా నడిచే వాత్సల్య అనాథ శరణాలయం సందర్శన; ఆయన పాల్గొన్న కార్యక్రమాలన్నిటిలోకి ఉత్తమమైనదిది. అక్కడ నుంచి ఆదిత్య నగర్‌లో ఆదిత్య విద్యా సంస్థల భవనానికి రిబ్బను కత్తిరించి, జయభారత్ ఆస్పత్రి సందర్శించారు. తనకు రాజకీయ గురువులనదగిన వైసి.రంగారెడ్డి, ధనెంకుల నరసింహం, పొన్నలూరు సీతారామిరెడ్డి గార్లను; మరికొందరు పాత మిత్రులను వారి ఇళ్లకు వెళ్లి పలకరించాడు. ఎసి స్టేడియంలో స్విమ్మింగ్ పూల్‌కు శంకుస్థాపించి, ద్వారకాబజారు సందర్శించి, ఆర్ఎస్ఎస్ ఆఫీసులో అటెండెన్స్‌వేసుకొని, అక్షర సంక్రాంతి ప్రదర్శనకు జెండా వూపి, డిఆర్‌డిఎ సమీక్ష జరిపారు. వీటన్నింటికి ఆయన పరుగులు పెట్టిన తీరు - గిరున తిరిగే బొంగరం వలె కన్పించింది.

తర్వాత విఆర్ కాలేజిలో పూర్వ విద్యార్థుల సత్కారం. ఇటు అధికారము అటు పార్టీపరము కాని స్నేహ పూర్వక సభ ఇది. రాజకీయాల కతీతంగా, విఆర్ కాలేజి విద్యార్థిగా ఉన్నతికి వచ్చినందుకు గౌరవంగా జరిగింది. అందువల్లే రాజకీయ ప్రత్యర్థులుగా భావింపబడే వారూ ఇందులో పాల్గొన్నారు. మరీ విశేషం - మాజీ ముఖ్యమంత్రి, కాంగ్రెస్ నేత నేదురుమల్లి జనార్దనరెడ్డి హాజరుకావడం. రాజకీయ విభేధాలు విస్మరించి మిత్ర భావంతో తమ రాజకీయ ప్రత్యర్థులను గౌరవించేందుకు ఎంతో హృదయ వైశాల్యం కావాలి. నెల్లూరీయులలో ఆ ఉన్నత సంస్కారం సజీవంగా వుందని నిరూపించారు జనార్దనరెడ్డి గారు.

సభ చాలా ఆహ్లాదకరంగా జరిగింది. అతిధులందరూ విఆర్ కాలేజి పాత విద్యార్థులే. జనార్దనరెడ్డి గారు సభనధ్యక్షించారు. దక్షిణ భారత పారిశ్రామిక వేత్తలలోనే అగ్రగణ్యుడు, దేశంలో మొట్టమొదట ప్రైవేటు విద్యుత్ కర్మాగారం నిర్మాత జి.వి.కృష్ణారెడ్డి; 10వేల కోట్ల రూపాయల ప్రభుత్వ రంగ సంస్థ - గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ ఛైర్మన్, ఇంజనీరింగ్ యజమాన్య నైపుణ్యంలో అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన మేధావి సిఆర్. ప్రసాద్ - ఈ సభకు విశిష్ట అతిధులు. వీరిద్దరి రాక ఈ కార్యక్రమానికే వన్నె తెచ్చింది. సభావరణంలోకి రాగానే వెంకయ్య నాయుడు గారు తన పాత మిత్రులు, చదువు నేర్పిన గురువులు, హితైషులను ఆప్యాయంగా పలుకరించారు. పారిశ్రామిక వేత్త జి.వి.కె. మాట్లాడుతూ 1955-57 ప్రాంతంలో ఈ కాలేజిలో ఇంటర్మీడియేట్ చదువుతున్నప్పుడు విద్యార్థి సంఘం జాయింట్ సెక్రటరీగా పోటీ చేసి ఓడిపోయాను. ఒకవేళ ఈ ఎన్నికల్లో గెల్చి వుంటె నా జీవితం వేరే మార్గంలో సాగి వుండేదేమో - అన్నారు. గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా ఛైర్మన్ సి.ఆర్. ప్రసాద్ మాట్లాడుతూ క్రమశిక్షణ, ఉత్తమ విద్యలకు వేదిక విఆర్ కాలేజి అని ప్రశంసించారు. దేశ వ్యాప్తంగా ఎన్నో సహజవాయువుల వనరులు కనుగొనడంలో నా పాత్ర వుంది; భవిష్యత్తులో గ్యాస్ ఆధారిత విద్యుత్ ఎంతో అవసరం. విద్యుత్ ప్రాజెక్టుల స్థాపనల రంగంలో జి.వి.కె. జ్ఞానమపారం. ఎల్‌పిజి గ్యాస్ విజయవాడ వరకు పైపుల్లో తేవాలని ప్రణాళిక తయారుచేసి వున్నాం. వెంకయ్య నాయుడు ఈ పథకానికి చేయూతనిస్తే నెల్లూరు వరకు తేవడానికి ప్రయత్నిస్తానన్నారు. ఆనం భక్తవత్సల రెడ్డి మాట్లాడుతూ జనతా పార్టీలో వున్నప్పుడు బాబుల్‌రెడ్డి ఒంగోలు సీటు నుంచి నన్నుపార్లమెంట్‌కు పోటీకి పెట్టారు. పోటీ చేసింది నేనే అయినా వుపన్యాసాలన్నీ వెంకయ్య నాయుడివే న్నారు. మాజీ ముఖ్యమంత్రి, నరసారావ

తరువాయి 11వ పేజీలో

## క్రికెట్ కల్మషం

క్రికెట్ క్రీడలో మ్యాచ్ ఫిక్సింగ్ ఆరోపణలు నిజమేనని నిర్ధారించింది సిబిఐ దర్యాప్తు బృందం. భారతీయ ఆటగాళ్ల తోపాటు పలు ఇతర దేశాల మేటి క్రీడాకారులూ ఈ పాపంలో పాలు పంచుకున్నారని తేటతెల్లం చేసింది వారి నివేదిక. నిజానికి ఈ నివేదికలో కొత్తదనం ఏదీ లేదు. ఆరేడు నెలలుగా పత్రికలలో వస్తుండిన వార్తల కంటె అదనపు సమాచారం అసలే లేదు. అయితే కేవలం వార్తలు చదివినవారికి - నిజమో, కాదో అనే సందేహం పీడిస్తుంది; సిబిఐ నివేదిక అంటె రూఢీ అనే నమ్మకం కల్గుతుంది.

దర్యాప్తులో ప్రముఖంగా తేలిన విషయం - మాజీ కెప్టెన్ అజరుద్దీన్ కుత్సితం. పది పన్నెండేళ్లకు పైనుంచే అతడు క్రికెట్ జూదగాళ్ల చేతిలో కీలుబొమ్మగా వ్యవహరిస్తున్నాడట. ఆటకు ముందే పిచ్ స్వభావాన్ని జూదం నిర్వాహకులకు చేరవేయడం; వారితో ఒప్పందం కుదుర్చుకొని, డబ్బు తీసుకొని ఆట తీరును తారుమారు చేయడం; తతిమా ఆటగాళ్లను కూడా ప్రలోభపెట్టి జూదగాళ్ల వలలో ఇరికించడం వంటి తప్పుడు పనులన్నీ చేశాడు అజారుద్దీన్. అంతేకాదు - అంతర్జాతీయ స్మగ్లర ముఠాతోనూ అతడికి ప్రత్యక్ష సంబంధాలున్నాయని; దావూద్ ఇబ్రహీం సోదరుడితో వ్యాపార లావాదేవీలున్నాయని తేల్చి చెప్పింది సిబిఐ. అజయ్ జడేజా, అజయ్‌శర్మ, నయాన్ మోంగియా, మనోజ్ ప్రభాకర్‌లకూ మ్యాచ్ ఫిక్సింగ్‌తో సంబంధాలున్నాయని నిర్ధారించింది.

క్రికెట్ అంటే భారతీయులకు అపరిమితమైన ప్రేమ; క్రికెట్ ఆడే వాళ్లంటె అలివిమాలిన అభిమానం. సినిమా తారలకంటె, రాజకీయ నేతల కంటె, స్వామిజీల కంటె క్రికెట్ స్టార్‌లపైనే యువతరానికి క్రేజ్. వారిని అభిమానించి, ఆరాధించి, పూజించే వెర్రిజనం సంఖ్య కోటాను కోట్లు. క్రికెట్ ఆటలో భారత జట్టు గెలిస్తే దేశమంతటా పండుగ చేసుకోవడం ఎన్నోసార్లు చూశాం; ఓడిపోతే - తమ ఆప్తులెవరో చనిపోయినంతగా విషాదంలో మునిగిపోయే క్రికెట్ ప్రేమికుల సంఖ్యకూ కొదువ లేదు. రిక్షాతొక్కేవాడి నుంచి ఇండస్ట్రియలిస్ట్‌ల వరకు; కాలేజి విద్యార్థుల నుంచి ప్రధానమంత్రుల వరకు క్రికెట్ ఆట జరిగినంత సేపూ టివిలకు అతుక్కపోతుంటారు. టివిలు లేని రోజుల్లో ట్రాన్సిస్టర్ రేడియోలు వీరి చెవుల్లోనే వుండేవి. యావత్ భారత దేశ ప్రజానీకానికి - రాష్ట్రం, భాష, వయస్సు, వృత్తి, స్తోమతల తేడా లేకుండా - ఇంతగా ఇష్టమైన అంశం మరొకటి లేనదడం అతిశయోక్తి కాదు.

క్రికెటర్లతో మాట్లాడే అవకాశం దొరికినా, చూసే సందర్భం వచ్చినా, చివరకు ఆటోగ్రాఫ్ లభించినా ఏనుగెక్కినంత సంబరపడే పిచ్చిజనాన్ని - అదే క్రికెటర్లు ఇంతగా దగా చేయడం కంటె ద్రోహం, దుర్మార్గం వేరుండవు. డబ్బుకోసం, విలాసాల కోసం దేశం పరువు, మర్యాద, మానం తాకట్టుపెట్టిన ఈ నీచులు - కన్నతల్లితో వ్యభిచారం చేసే దగుల్బాజీల క్రింద లెక్క.

ఈ దర్యాప్తుతో సంతోషపడగల్గిన ఒకే ఒక వ్యక్తి - కపిల్‌దేవ్. మనోజ్ ప్రభాకర్ వంటి వారు ఆయనపై తీవ్రాతి తీవ్రమైన ఆరోపణలు చేశారు. ఈ పాపంలో భాగం వుందని పదే పదే చెప్పారు. అజరుద్దీన్ కంటె కపిల్‌దేవ్‌పై వచ్చిన ఆరోపణలనే జనం అధికంగా విశ్వసించారనడం నిజం. సిబిఐ నివేదికతో ఆయనకు మానసిక క్షోభ తొలగిపోయింది.

మ్యాచ్ ఫిక్సింగ్ ఆరోపణలు వచ్చిన సమయంలో ఎంత నాటకం ఆడాడు అజారుద్దీన్? ఎన్ని కపట మాటలు మాట్లాడాడు? తానేదో నిజాయితీపరుడైనట్లు, తాను మైనారిటీ మతానికి చెందిన వాడిని కాబట్టి తనపై నిందలు వేసి క్షోభ పెడుతున్నట్లు రభస సృష్టించాడు. ఇప్పుడు తన నేరాలు ఇంత స్పష్టంగా రుజువైన తర్వాత అతడే సమాధానం చెప్తాడు?

ఇటువంటి దేశద్రోహుల నుంచి సమాధానాలు ఆశించడం వ్యర్థం. కేవలం చట్టాలను, నిబంధనలను ఉల్లంఘించడమే కాదు - ప్రజల నమ్మకాన్ని, జాతిప్రతిష్ఠను నాశనం చేసిన వారికి ఈ గడ్డపై జీవించే హక్కు లేదు; ఉండడానికి లేదు. న్యాయస్థానాలలో వారిపై కేసులు పెట్టి, విచారణ జరిగి; రుజువులు, సాక్ష్యాలు దొరికి, శిక్షలు పడేందుకు ఎన్నేళ్లు పడుతుందో చెప్పలేము. అంత వరకు ఈ నీచులు మన మధ్య, మన సమాజంలో భాగస్వాములుగా తిరగడం సహించడం కష్టం. ఏ ప్రజలైతే వీరిని హీరోలుగా, దేముళ్లుగా అభిమానించి, ఆరాధించారో - అదే ప్రజలు వీరిని దేశద్రోహులుగా ఛీత్కరించి, పబ్లిక్ ప్రదేశాలలో కన్పించినప్పుడల్లా ముఖాన ఉమ్మేసి, సామాజిక బహిష్కారానికి గురిచేయడమే వీరికి తగిన శిక్ష అవుతుంది.

జమీన్‌రైతు

హాకీలో మన ప్రతిభ అంతరించిన తర్వాత - భారతీయుల పరువు నిల్పుతున్న ఏకైక క్రీడ - క్రికెట్. ఒకసారి కాకుంటె, ఒకసారి అయినా గెల్చి జనానికి తృప్తి కల్గిస్తున్నది ఇది ఒక్కటే. అజరుద్దీన్, అజయ్ జడేజా వంటి హీనుల దుష్కృత్యాల వల్ల దానికి కల్మషం అంటడం విచారకరం. ప్రభుత్వము, ప్రజా సంఘాలు పూనుకొని దానిని నిర్మూలించడానికి చిత్తశుద్ధితో కృషిచేయవలసిన అవసరం వుంది. రాజకీయాల వలె క్రీడలు కూడా డబ్బుకు అమ్ముడుపోయే వస్తువులుగా మారకూడదు.

భవిష్యత్‌లో మరే ఆటగాడూ ఈ పాపం చేయకుండా ప్రభుత్వము, క్రికెట్ కంట్రోలు బోర్డు కఠినమైన నిబంధనలు రూపొందించాలి. మ్యాచ్ ఫిక్సింగ్ శిక్షార్హమైన నేరంగా చట్టం చేయాలి. క్రికెట్ ఆటలో ధన ప్రభావాన్ని తగ్గించడానికి సైతం ప్రయత్నించడం మంచిది. స్పాన్సర్‌షిప్‌లు, పబ్లిసిటీ కాంట్రాక్టులు, మోడలింగ్ పనులు వంటి వాటి ద్వారా క్రికెటర్లు కోట్లకు పడగలెత్తుతున్నారు. ఈ మితిమీరిన ధనార్జన వారిలో మరింత దురాశను ప్రేరేపిస్తున్నది.

ఒలింపిక్ క్రీడలలో పాల్గొనే భారతీయ క్రీడాకారులకు విమానం టిక్కెట్ కొనివ్వడానికి ఏ కార్పొరేట్ సంస్థా ముందుకు రాదు; కాని ఆటస్థలంలో అరగంట పాటు కూడా నిలువని క్రికెట్ స్టార్ చేతిలోని బ్యాట్‌పై తమ లోగో ముద్రించినా, కోట్లు చెల్లిస్తారు. కేవలం ఒక ఆటను ఇంతగా ఆదరించి, తతిమా వాటిని నిరాదరించే పక్షపాత వైఖరి వ్యాపార రంగానికి అబ్బడం వల్లనే దేశంలో క్రీడలు అభివృద్ధి చెందడం లేదు. డబ్బు కోసం దేశాన్ని తాకట్టు పెట్టే క్రికెటర్ల కంటె - కష్టపడి, స్వయం ప్రతిభతో దేశం పరువు నిల్పే కరణం మల్లేశ్వరి, కోనేరు హంపి వంటి వారికి ప్రభుత్వము, పారిశ్రామిక రంగము ఆదరణ చూపే రోజు వస్తేనే అందరికీ ప్రయోజనకరం! *

---

జమీన్‌రైతు

3.11.50

వెల: 0-3-0 పేజీలు: 12

### 50 ఏళ్ల క్రితం ఈ నాడు

### ప్రెసిడెంట్ ట్రూమన్‌కు ప్రాణగండం తప్పింది

అమెరికా అధ్యక్షుడు ట్రూమన్‌ను హత్య చేయుటకు 1తేది రాత్రి అధ్యక్షుని నివాసమైన బ్లెయర్ హౌస్‌లోనికిద్దరు వ్యక్తులు ప్రవేశించి, ట్రూమన్ అంగరక్షకులపై కాల్పులు జరుపగా, అంగ సంరక్షకులు ఎదురు కాల్పులు సాగించి, దుండగులలో ఒకరిని చంపారు. మరొకరు తీవ్రంగా గాయపడ్డారట. అంగరక్షకులలో ఒకరు మరణించడం జరిగింది. ఈ సందడంతా విని నిద్రపోతున్న ట్రూమన్ కిటికీ వద్దకు వచ్చి చూడగా, అప్పటికే అంతా జరిగిపోయింది. తక్కిన కార్యమంతా సిబిడి శాఖ వారు చిత్తగించుకున్నారు. దీనితో సంబంధమున్న మూడో వ్యక్తి కొరకు గాలిస్తున్నారట. మొత్తానికి ప్రెసిడెంట్ ట్రూమన్ పెద్ద గండం నుంచి బయటపడ్డట్టే!

### నేతాజీ చైనాలో వున్నాడట

నేతాజీ సుభాష్ చంద్రబోస్ తప్పకుండా బ్రతికే వున్నాడు. ఉత్తర చైనాలో సన్యాసి జీవితం గడుపుతున్నాడు. పాకిస్తాన్ రాజ్యాంగ పరిషత్తులో ఒక ప్రముఖ సభ్యుడు పైవిధంగా వెల్లడించాడు. ఈయన, దేశ విభజనకు ముందు నేతాజీ గ్రూపులో ముఖ్యమైన వాడుగా కూడా వుండినాడు. ఆయన మరో విషయం కూడా చెప్పాడు.

నేతాజీ అభిమానులందరికీ ఆశ్చర్యం కల్గించే మరో విషయం కూడా వుంది. 1945 జపాన్ పతనమైన తర్వాత నుంచీ నేతాజీ, చైనా కమ్యూనిస్టు పార్టీలో ముఖ్యమైన సభ్యుడుగా పనిచేశాడు. నేతాజీ విమాన ప్రమాదం, అందులో ఆయన మరణించడం - ఈ వార్తలు ఆంగ్లో అమెరికన్ల కళ్లు మూయడానికి ప్రచారం చేయబడ్డవే అన్నాడు ఆయన.

### ఎర్రనైనా దుష్కృత్యం

హిమాలయోత్తుంగ శిఖరాల శీతల బాహుబంధంలో చల్లగా

తరువాయి 10వ పేజీలో

---

## జనవాణి

# కరెంట్ లేకుండా ఐటి ఎట్లా సాధ్యం?

దీపావళి రోజున నవాబుపేట ప్రాంతంలో ఆరు పర్యాయాలు కరెంట్ తీసివేయడం జరిగింది. మన రాష్ట్రంలో ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీపై అధిక ప్రాచుర్యం జరుగుతున్న ఈ రోజుల్లో విద్యుత్ ఆవశ్యకత ఎంతైనా వుంది. గత సంవత్సరం నేను డెన్మార్క్ దేశంలో మూడు మాసాలుండటం జరిగింది. ఒక పర్యాయం రిపేర్ల కోసం అరగంట విద్యుత్తును ఆపవలసి వచ్చింది అక్కడ; ఆ విషయాన్ని వారం ముందే స్థానిక ప్రజలకు లేఖల ద్వారా, ఇంటర్నెట్ ద్వారా తెలియజేశారు. అమెరికా, యూరప్‌లలో ప్రాథమిక సౌకర్యాలు బాగా ఒన గూడడం వల్లనే ఐటి బాగా అభివృద్ధి చెందింది. మన దేశంలో సాలీనా తొమ్మిది వేల మెగావాట్ల విద్యుత్ లోపం వుంది. 2012 నాటికి విద్యుత్‌ను చాలినంతగా ఉత్పత్తి చేయాలంటె 11లక్షల కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టాల్సి వస్తుంది. ఈ పరిస్థితిలో విద్యుత్ ఆదా, ప్రత్యామ్నాయ ఇంధన వనరులను విరివిగా ఉపయోగించుకోవడం ఎంతైనా అవసరం.

నెల్లూరు డాక్టర్ ఎ. జగదీష్

### జ్యోతిబసు స్వచ్ఛంద పదవీ విరమణ

పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగా జ్యోతిబసు 23ఏళ్లు అవిచ్ఛిన్నంగా పరిపాలించి, స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. భారతదేశ రాజకీయాల్లో ఈ విధంగా పదవీ విరమణ చేసిన ముఖ్యమంత్రి మరొకరు లేరు. 86ఏళ్ల జ్యోతిబసు వాస్తవానికి అనారోగ్య కారణాల వల్ల రాజీనామా చేశానని బయటకు చెప్తున్నప్పటికీ, అది అసలు కారణం కాదు; వచ్చే అసెంబ్లీ ఎన్నికల్లో సిపిఎం పార్టీకి తక్కువ సీట్లు వస్తాయని భావించి ముందుగానే తన గౌరవం నిలబెట్టుకొను రాజీనామా చేసినట్లున్నారాయన. జ్యోతిబసు సిపిఎం పార్టీకి చెందిన వ్యక్తి అయినా పెద్ద మనిషి అనాలి. పశ్చిమబెంగాల్‌లో భూ సంస్కరణలు, పంచాయతీ రాజ్ వ్యవస్థను సంస్కరించిన వ్యక్తిగా బెంగాలీ ప్రజల

తరువాయి 10వ పేజీలో

# ప్రైవేట్ విద్యకు లక్ష్మీ కళ - సర్కార్ చదువుకు ప్రేతకళ!

రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విద్యార్థి వ్యతిరేక విధానాలకు నిరసనగా అఖిల భారత విద్యార్థి పరిషత్ విద్యా రంగ పరిరక్షణ ఉద్యమాన్ని చేపట్టింది. దీనిలో భాగంగా 30తేది ఎబివిపి విద్యార్థులు విఆర్ కాలేజి క్యాంపస్‌లో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు దిష్టి బొమ్మను తగులబెట్టారు. ఈ సందర్భంగా జరిగిన గేట్ మీటింగ్‌లో విద్యార్థుల నుద్దేశించి ఎబివిపి రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు ఎం. రాధాకృష్ణ మాట్లాడుతూ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాల వల్ల

## నెల్లూరు సంగతులు

ప్రభుత్వ విద్యా సంస్థల తీరు రోజు రోజుకీ దిగజారుతున్నది. ప్రైవేట్ రంగంలో విద్యా వ్యాపారం దిన దినాభివృద్ధి చెందుతూ ప్రైవేట్ విద్యకు లక్ష్మీకళ, సర్కారు విద్యకు ప్రేతకళ దాపురించిందన్నారు. యూనివర్శిటీలకిచ్చే గ్రాంట్‌లో కోత విధించడం వల్ల సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సులు పుట్టుకొచ్చి, ఉన్నత విద్య ఉన్నత వరాల వారికే పరిమితమయ్యేటట్లు చేశాయన్నారు. కరవు ప్రాంతాల్లో స్కూల్ పిల్లలకు ఫీజు మాఫీ చేయమని జి.ఓ జారీ చేస్తే పట్టించుకొనే వారు లేకుండా పోయారని విమర్శించారు. ఈ కార్యక్రమంలో ఎబివిపి జిల్లా సహ ప్రముఖ్ పి. భాస్కరం, సతీష్, మహేష్, విక్టర్, శివ, దుర్గ, సుధీర్, సురేష్ పాల్గొన్నారు.

### మెదడువాపు వ్యాధి పట్ల అప్రమత్తంగా వుండాలి

జిల్లా కలెక్టర్ తమ జిల్లాలోని వైద్యాధికారులు, సిబ్బంది, టీచర్లు, సర్పంచుల ద్వారా ప్రజలను అప్రమత్తం చేసి మెదడు వాపు రాకుండా చర్యలు తీసుకోమని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆదేశించారు. 30తేది వీడియోకాన్ఫరెన్స్‌లో జిల్లా అధికారులతో మాట్లాడారు. నోడల్ అధికారులు గ్రామాలకు వెళ్లి సమావేశాలు ఏర్పాటు చేసి ప్రజలను చైతన్యవంతులు చేయాలన్నారు. దోమల నిర్మూలన, పందులను దూర ప్రాంతాలకు తరలించే ఏర్పాట్లు తక్షణం చేయమని ఆదేశించారు. కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ మాట్లాడుతూ జిల్లాలో 5 మండలాలకు చెందిన 5 గ్రామాల్లో 5 మందికి, కావలి మునిసిపాలిటీలో మరో ఇద్దరికి మెదడు వాపు సోకిందన్నారు. వీరిలో ఒక పిల్లవాడు మృతి చెందినట్లు చెప్పారు. రెండువేల మంది పిల్లలకు 6వేల డోసుల బెల్లడోనా మాత్రలు పంపిణీ చేసినట్లు కలెక్టర్ వివరించారు. వైద్యాధికారులు మధుసూదన్‌సింగ్, డాక్టర్ జీవన్, మునిసిపల్ కమీషనర్ వేమారెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

వి.ఆర్. కలేజి పూర్వ విద్యార్థుల తరపున వెంకయ్య నాయుడ్ని సన్మానిస్తున్న ఆనం భక్తవత్సల రెడ్డి. ప్రక్కన డోలేంద్ర ప్రసాద్, రామనారాయణరెడ్డి, జనార్ధనరెడ్డి, వివేకానందరెడ్డి.

# పిడబ్ల్యుడి అధికారులే దురాక్రమణదారులు!

నెల్లూరుటౌన్‌లోని రామలింగాపురం సెంటర్‌లో వున్న ఇరిగేషన్ కార్యాలయం ప్రహరీ గోడను ఆనుకొని వున్న స్థలాన్ని ఆ శాఖాధికారులే ఆక్రమించుకొని నెల బాడుగలకు ఇస్తున్నారు. ఈ స్థలాల్లో టీ బంకులు, బడ్డీకొట్లు, మెకానిక్, కూల్‌డ్రింక్ షాపులు వెలిశాయి. ట్రాఫిక్‌తో నిత్యం ఈ ప్రాంతం రద్దీగా ఉంటుంది. దురాక్రమణల వల్ల రోడ్డు కుంచించుకు పోవడంతో తరచూ ట్రాఫిక్ స్తంభించి పోతున్నది. సర్వేపల్లి కాలువ బ్రిడ్జి దాటిన తర్వాత ఉత్తరం, దక్షిణం వైపున వున్న ఇరిగేషన్ స్థలాల్లో వెలసిన పక్కా భవనాల యజమానుల నుంచి కూడా ఇరిగేషన్ అధికారులు ప్రతినెలా బాడుగలు వసూలు చేసుకొంటూ జల్సాగా కాలం గడుపుతున్నారు. ఇరిగేషన్ ఆఫీసు సెంటర్‌లో ఉత్తరం వైపున వున్న ఒక ప్రొవిజన్ షాపు వారు గచ్చు, దక్షిణం వైపున ఒక వ్యక్తి ప్రభుత్వ స్థలంలో ఫెన్సింగ్ వేసుకొని వుండడం వల్ల వాహనాల రాకపోకలకు అడ్డంకిగా పరిణమించింది. ఈ ప్రాంతంలోని ఆక్రమణలను తొలగించి రోడ్డును విశాలం చేస్తే ట్రాఫిక్ సమస్యలు తీరుతాయి.

### జిల్లా జైలులో వైద్య శిబిరం

జిల్లాజైలులోని ఖైదీల ఆరోగ్య స్థితిగతులను పరిశీలించేందుకు 28తేది వైద్య శిబిరం ఏర్పాటయ్యింది. పెద్దాస్పత్రి డాక్టర్లు రవీంద్రనాథ్ ఠాగూరు, వరప్రసాద్, కృష్ణమూర్తి, జైలు డాక్టర్ వీరప్రతాప్ శిబిరంలో పాల్గొన్నారు. అవసరమైన వారికి ఉచితంగా మందులిచ్చారు. అనంతరం బ్రహ్మకుమారి ఈశ్వరీయ విద్యాలయానికి చెందిన బ్రహ్మకుమారీలు ప్రభ, పద్మ ఖైదీలకు హితబోధ చేశారు. జైలర్ టి. అనంతరావు ఈకార్యక్రమాన్ని పర్యవేక్షించారు.

### దువ్వూరి రామిరెడ్డి జయంతి సభలు

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి 105వ జయంతి సభలు 9,10 తేదీల్లో టౌన్‌హాల్‌లో జరుగుతాయి. వర్తమాన సమాజం నేతృత్వంలో తొలిరోజు జరిగే సభకు న్యాయవాది ఎ.వి.రమణారెడ్డి అధ్యక్షత వహిస్తారు. విఆర్ కాలేజి ఆంధ్ర శాఖ పూర్వాధ్యక్షులు వొరాపూరు వేణుగోపాలయ్య కవికోకిల సాహిత్యంపై ఉపన్యసించి, విజ్ఞాన సమితి చేసే సన్మానాన్ని స్వీకరిస్తారు. 10తేది డాక్టర్ జెట్టి శేషారెడ్డి గారి అధ్యక్షతన జరిగే సభలో ప్రముఖ గ్యాస్ట్రో ఎంట్రాలజిస్ట్ డాక్టర్ పుచ్చలపల్లి మిత్ర 'ఆరోగ్య సమస్యలు' అనే అంశంపై మాట్లాడి సమితి సన్మానాన్ని స్వీకరిస్తారని, ఈ కార్యక్రమానికి అందర్నీ తరలి రమ్మంటున్నారు సమితి అధ్యక్షులు ఎ.వి.రమణారెడ్డి.

నెల్లూరులో అక్షరజ్యోతి కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్న కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామంత్రి వెంకయ్య నాయుడు, ప్రక్కన జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకర్ రెడ్డి

### కరాటేలో నెల్లూరీయుల ప్రతిభ

చిలకలూరిపేటలో జరిగిన రాష్ట్ర స్థాయి ఓపెన్ కరాటే 2000 పోటీల్లో నెల్లూరీయులు అద్భుత ప్రతిభ చూపి బహుమతులను కైవసం చేసుకున్నారు. బ్లాక్ బెల్ట్ డివిజన్‌లో ఎన్. సునీల్‌కుమార్ ప్రథమ స్థానం సంపాదించారు. బ్లాక్ బెల్ట్ 60కిజీల లోపు కేటగిరి స్పారింగ్‌లో

కొరవ 11వ పేజీలో

ఇందిరాగాంధీ వర్ధంతి సభలో మాట్లాడుతున్న డిసిసి అధ్యక్షుడు సివి శేషారెడ్డి, చిత్రంలో బాలచెన్నయ్య, దేవకుమార్ రెడ్డి, చంద్రశేఖర్ రెడ్డి, శ్రీధర్, ప్రవీణ్‌కుమార్ రెడ్డి వున్నారు.

# కాంగ్రెస్‌వాదుల ఉలికిపాటు!

మాజీ ప్రధాన మంత్రి స్వర్గీయ ఇందిరాగాంధీ 16వ వర్ధంతి జిల్లా కాంగ్రెస్ పార్టీ నేతృత్వంలో 31తేది ఇందిరాభవన్‌లో ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటైన సభకు జిల్లా కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి అధ్యక్షత వహించారు. ఆయన మాట్లాడుతూ ఇందిరాగాంధీ దేశం కోసం ప్రాణాలర్పించిన ధీరవనిత అని; బడుగు బలహీన వర్గాల అభ్యున్నతికి విశేషంగా కృషి చేసినట్లు చెప్పారు. ప్రతి వస్తువు ధరపెంచి పేద సామాన్య, మధ్యతరగతి ప్రజల జీవితాలను అతలాకుతలం చేస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ధోరణిని నిరసిస్తూ, కాంగ్రెస్ కార్యకర్తలు ప్రజలను జాగృతం చేయాలన్నారు. సభలో కాంగ్రెస్ నాయకులు దేవకుమార్ రెడ్డి, మేకపాటి శేఖరరెడ్డి, సి.ప్రవీణ్ కుమార్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అరుణమ్మ, బాలసుధాకర్, సల్మా బషీర్ తదితరులు పాల్గొన్నారు.

ఈ సభలో విశేషం - మేకపాటి శేఖరరెడ్డి ప్రసంగం. ఉదయగిరి-రాజకీయాలలో తప్ప, టౌన్ వ్యవహారాలలో ఎప్పుడూ తల దూర్చడం అలవాటు లేదాయనకు. సి.వి.శేషారెడ్డి పిలుపుపై ఈ సభకు వచ్చినట్లున్నారు. సభలో వక్తలు తప్ప, శ్రోతలు లేకపోవడం చూసి కడుపు మండినట్లుంది. ఒకరికి నలుగురు ఎమ్మెల్యేలు గెల్చిన జిల్లాలో ఇందిరమ్మ వర్ధంతి వంటి సభను ఇంత పేలవంగా, జనం లేకుండా జరపడం సిగ్గు చేటని వ్యాఖ్యానించారు శేఖరరెడ్డి. పార్టీ పట్ల, పార్టీ కార్యక్రమాల పట్ల నేతల్లో ఏ మాత్రం చిత్తశుద్ధి లేకపోవడం

కొరవ 11వ పేజీలో

## వెంకయ్యనాయుడి పలవరింత!

# ఉదయగిరిలోనే వుండి పోవాలనుంది!

కేంద్ర గ్రామీణాభివృద్ధి మంత్రి హోదాలో వెంకయ్య నాయుడు గారి తొలి నెల్లూరు పర్యటన అర్భాట, ఆప్యాయతలతో జరిగింది. 31, 1తేదులు రెండు రోజులూ ఎక్కడా రెండు కాళ్లు ఒక చోట పెట్టకుండా ఉరుకులు, పరుగుల మీద తిరిగాడు వెంకయ్యనాయుడు. సుడిగాలి పర్యటన చేశాడు. మొట్ట మొదటిసారిగా నెల్లూరు వచ్చే సమయంలో పునాదిరాళ్లు, రిబ్బన్ కత్తిరింపుల వంటి అధికారిక కార్యక్రమాల కంటే ముఖ్యంగా పలుకరింపులు, నమస్కారాల

### నెల్లూరు పల్లెల్లో ముగ్గురు కేంద్ర మంత్రులు

చెల్లింపులకు ప్రాముఖ్యత ఇచ్చాడాయన. తన రాజకీయ ఔన్నత్యానికి, మనుగడకు సహకరించిన వారందరినీ పేరు పేరునా పలకరించి వెళ్లడమే ఈ పర్యటన విశేషం.

ఉదయగిరిలో మొదలైంది - కార్యక్రమం. వెంకయ్యనాయుడుకు రాజకీయ భిక్ష పెట్టింది ఉదయగిరివాసులే. 1978 ఎన్నికలలో, ఇందిరమ్మ ప్రభంజనంలో జిల్లాలోని తతిమా 10 స్థానాల్లో జనతా అభ్యర్థులు పరాజయం పాలైనా, ఉదయగిరిలో మాత్రం వెంకయ్యనాయుడు గెల్చాడు. ఎమ్మెల్యేగా అసెంబ్లీని రారెత్తించి, తద్వారా రాష్ట్ర వ్యాప్తంగా ప్రజల గుర్తింపు పొందగల్గింది ఈ ఎన్నికవల్లనే. ఆ రుణం తీర్చుకోవడానికి ఉదయగిరిని తన కార్యక్రమ జాబితాలో మొదటి పేరుగా చేర్చినట్లున్నాడు. తనొక్కడే రాకుండా తన వెంట మరిద్దరు కేంద్ర మంత్రులను తీసుకొచ్చాడు. సమాచార మంత్రిణి సుష్మాస్వరాజ్, పర్యాటక శాఖ మంత్రి అనంతకుమార్‌లు వెంటవచ్చారు. సుష్మాస్వరాజ్ రాక ఉద్దేశం - ఉదయగిరిలో నిర్మించిన టివి టవర్‌కు రిబ్బను కత్తిరింపు; అనంతకుమార్‌కు ఉదయగిరి కొండ చూపించి, దాన్ని టూరిజం స్పాట్‌గా అభివృద్ధి చేయించే తలంపు.

ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో మాట్లాడుతూ నా శాఖ ద్వారా వీలైనన్ని ఎక్కువ నిధులు ఉదయగిరికి విడుదల చేసి తన రుణం తీర్చుకొంటానన్నాడు వెంకయ్యనాయుడు; నేను మంత్రి అయిన మరుక్షణమే తొలి అధికార పర్యటన పుట్టినింటి నుంచే ప్రారంభించాలన్న ధ్యేయంతో ముందుగా ఉదయగిరి వచ్చాను. ఉదయగిరివాసుల విన్నపాలు తెలుసుకొనేందుకు ఢిల్లీలోని తన మంత్రిత్వ శాఖలో ప్రత్యేక సెల్ ఏర్పాటు చేశాను. ఏ సమస్య మీద ఎప్పుడు ఎవరు ఉత్తరం వ్రాసినా వెంటనే పని చేసి పెడతానన్నారు ఏడు సంవత్సరాలు ఎమ్మెల్యేగా ఉన్నప్పటి అనుభూతి నేడు కేంద్ర మంత్రి స్థాయికి ఎదిగినా కలగడం లేదన్నారు. గ్రామీణ ప్రజలు, సమస్యల మీద అప్పుడు తిరిగే రోజులు గుర్తుకు తెచ్చుకొంటే తిరిగి ఇక్కడే ఉండిపోవాలన్న కోరిక కల్గుతుందన్నారు ఒంగోలు పార్లమెంట్ సభ్యుడు కరణం బలరాం కార్యసాధకుడని, ఆయన నేతృత్వంలో ఏ ప్రతిపాదన తనకు అందినా వెంటనే స్పందిస్తానన్నారు. ప్రసార శాఖామంత్రి సుష్మాస్వరాజ్ మాట్లాడుతూ మారుమూల పల్లె నుండి ఢిల్లీ స్థాయికి వెంకయ్యను చేర్చిన ఘనత ఉదయగిరి ప్రజలదన్నారు. పర్యాటక శాఖా మంత్రి



ఉదయగిరిలో టివి లోపవర్ ట్రాన్స్ మీటర్‌ను ప్రారంభిస్తున్న కేంద్ర సమాచార శాఖా మంత్రి సుష్మాస్వరాజ్, ప్రక్కన మంత్రులు వెంకయ్య నాయుడు, అనంత కుమార్, ఎమ్పీ బలరాం, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్.

అనంతకుమార్ మాట్లాడుతూ ఉదయగిరి దుర్గాన్ని పర్యాటక కేంద్రం చేసి తన రాజకీయ గురువు వెంకయ్య నాయుడి రుణం తీర్చుకొంటానన్నారు.

వెంకయ్య నాయుడు వేదిక దిగి, పాత మిత్రులను స్వయంగా పలకరించడంతో వాళ్లు ఎంతో ఆనందపడ్డారు. ఈ పర్యటనకు మాదాల జానకిరాం ఏర్పాట్లు చేయగా, కంభం విజయరామిరెడ్డి జన సమీకరణ చేశారు. స్థానిక బిజెపి నాయకుడు ఎస్. సుబ్బరాజు, జిల్లా వక్ఫ్ బోర్డు ఛైర్మన్ షమ్మీ ఏర్పాట్లు చూశారు.

* * *

ఉదయగిరి నుంచి హెలికాప్టర్ నేరుగా కసుమూరు దగ్గర మంగల గుంటలో దిగింది. అది ఆయన అత్తగారి ఊరు; ఆ ప్రక్కనే వున్న చటవపాళెం అమ్మగారి ఊరు. హెలికాప్టర్ దిగగానే - గ్రామస్తులు ఆయన్ను చుట్టు ముట్టి, పూలవర్షం కురిపిస్తూ అత్తారింటికి తీసుకెళ్లారు. కేంద్రమంత్రులు సుష్మాస్వరాజ్, అనంతకుమార్, రాష్ట్రమంత్రులు ప్రభాకరరెడ్డి, ఫరూక్ ఆయన వెంట వున్నారు. అక్కడ నుంచి కసుమూరు వెళ్లిన మంత్రుల బృందం మస్తాన్‌వలీ దర్గాను సందర్శించి భక్తి శ్రద్ధలతో

కొరవ 8వ పేజీలో

# బుచ్చి పంచాయితీలో అవినీతి మల్లుడు!

బుచ్చిరెడ్డిపాళెం పంచాయతీ కార్య నిర్వహణాధికారి తన స్వార్థ ప్రయోజనాల కోసం అడుగడుగునా అధికారాలను దుర్వినియోగం చేస్తూ అవినీతి మల్లుని అవతారమెత్తాడు. ఈ అధికారి పంచా

### సర్పంచ్ గారూ - మీ పేరు భ్రష్టు పట్టిస్తారు జాగ్రత్త!

యతీ స్థలాన్ని తన అబ్బసొత్తు మాదిరి అమ్మేస్తున్నాడు. అక్రమకట్టడాలు కొట్టి వారిని తానే దగ్గరుండి ప్రోత్సహిస్తున్నాడు. ఇతని ప్రోత్సాహంతో కొత్త గూడవల్లి కాలువపై, డిప్‌వీధి, విద్యా సదనం వీధుల్లో అక్రమ కట్టడాలు వెలిశాయి. అదే విధంగా కొత్తగూడవల్లి కాలువ పూడిక తీతలో బయటపడ్డ 20 వేల విలువ చేసే బొంతరాయిని ఇఓ అమ్ముకున్నట్లు తెలిసింది. గూడవల్లి కాలువ మీద కొత్తగా నిర్మించిన అక్రమ కట్టడాల విషయంలో పంచాయతీ అధికారులు కళ్లు మూసుకోవడానికి కారణం - ముడుపులే! పంచాయతీ స్మశానం నుంచి గాంధీనగర్‌లో గల నెల్లూరు తిరిపాలు రెడ్డి ఇంటి వరకు వేసే రోడ్డుకు పంచాయతీ చెత్త త్రోలి, వేల రూపాయలు డ్రాచేశారు; డిప్ వీధిలో ఇటీవల నాలుగు అంకణాల పంచాయతీ స్థలాన్ని ఆక్రమించి అక్రమ నిర్మాణం చేపట్టారు. వీరి వద్ద కూడా ఇ.ఓ బెదరించి ముడుపులుతీసుకొన్నారని చెప్తున్నారు. గూడవల్లి కాలువ మీద శ్లాబువేసి అక్రమ కట్టడాలు కట్టడం వెనుక ఇఓ హస్తముంది. మొత్తానికి ఇఓ అక్రమ చర్యల వల్ల నిజాయితీపరుడైన సర్పంచ్ డాక్టర్ మోహన్‌బాబుకు చెడ్డ పేరొస్తున్నది. ఈ అవినీతిమల్లుని

## జిల్లావార్తలు

కార్యకలాపాలపై జిల్లా పంచాయతీ అధికారి విచారణ జరిపిస్తే బాగుంటుంది.

### నీటికోసం తగాదా

దక్కిలి మండలం వెలికల్లు, మార్లగుంట గ్రామస్తుల మధ్య తెలుగు గంగనీటి మళ్లింపు వ్యవహారమై ఉద్రిక్తత చెలరేగి, వివాదంగా మారింది. అసంపూర్తిగా వున్న కండలేరు మూడవ బ్రాంచి కాలువ నుంచి నీటిని తమ చెరువుకు మళ్లించుకోవడానికి కొద్ది రోజులుగా వెలికల్లు రైతులు సన్నాహాలు చేస్తున్నారు. ఈ క్రమంలోనే మార్లగుంట రైతులు కూడా ఈ నీటిని తమ గ్రామ చెరువుకు మళ్లించుకోవడానికి పొక్లయిన్ ద్వారా కాలువ త్రవ్వకం మొదలుపెట్టారు. నీళ్లు తమ కంటే తమకు కావాలని గ్రామస్తులు గొడవ పెట్టుకొన్నారు. పరిస్థితి ఉద్రిక్తంగా మారడంతో తెలుగుగంగ అధికారులు పోలీసులకు ఫిర్యాదు చేశారు. తాము పోసిన నార్లు ఎండి పోతుం

కొరవ 8వ పేజీలో

# ఆత్మకూరు డాక్టర్ ఆదర్శం

ప్రభుత్వ ఆసుపత్రులు రోగులు లేక వెలవెలబోతున్న ఈ రోజుల్లో ఆత్మకూరులోని ప్రభుత్వ ఆసుపత్రికి ప్రతి దినం 300 మంది రోగులు వస్తున్నారు.

### ఇంత మంచివాళ్లు ఇంకా వున్నారా?

దీనికి కారణం ఇక్కడి డాక్టర్ ఎం. ఆదినారాయణరెడ్డి సేవాభావంతో, ఓపికతో వైద్యం చేయడమే! యోగక్షేమాలు విచారిస్తూ రోగులను చూడడమే కాకుండా అత్యవసర పరిస్థితుల్లో అవసరమైన మందులు డాక్టర్ గారే బయట కొనుగోలు చేసిస్తున్నారట. లేడీ డాక్టర్‌ను డిప్యూటేషన్‌పై 4 నెలలు అతికష్టం మీద డాక్టర్ వుంచగలిగారు. ఈ మధ్యే లేడి డాక్టర్‌ను దగదర్తికి బదలీ చేశారు. పాత తాలూకా కేంద్రంలోని ఆసుపత్రిలో లేడి డాక్టర్ లేకపోవడం దారుణం. ఆసుపత్రిలో మంచి డాక్టర్ వున్నప్పుడే ఎమ్మెల్యే కృష్ణయ్య దీని అభివృద్ధికి ప్రత్యేక నిధులు కేటాయింపజేస్తే బాగుంటుంది.

* * *

# నెల్లూరు ముచ్చట్లు

## పన్నుల వసూళ్లలో మునిసిపాలిటీ రికార్డు

నెల్లూరు మునిసిపాలిటీలో అక్టోబర్ నెలలో రికార్డు స్థాయిలో పన్నులు వసూలయ్యాయి. కేవలం ఇళ్ల పన్నుల ద్వారానే కోటి 10లక్షల రూపాయలు ఖజానాకు జమయింది. మునిసిపాలిటీ చరిత్రలో ఇంత వరకు ఒక్క నెలలో ఇళ్లపన్నుల ద్వారా కోటి 10లక్షలు వసూలు కావడం ఎప్పుడూ జరగలేదు. రావాల్సిన పన్నులన్నింటినీ ఇదే విధంగా వసూలు చేస్తే మునిసిపాలిటి ఆర్థిక పరిస్థితులు మెరుగుపడి, ప్రజలకు ఒకటో, అరో పనులు చేయవచ్చు. ఛైర్‌పర్సన్, కౌన్సిలర్లు కూడా సిగపట్లు మానేసి పన్నుల వసూళ్లపై దృష్టి నిలిపితే మంచిది.





## మెదడువాపు వ్యాధి మళ్లీ విజృంభణ

చిన్న పిల్లల పాలిట మహమ్మారిగా పరిణమించిన మెదడు వాపు వ్యాధి జిల్లాలో విజృంభిస్తోంది. జిల్లాలో ఇప్పటి వరకు ఏడుగురు పిల్లలు చనిపోయారు. నలుగురు నెల్లూరు రేబాల వారి సందులోని చిన్న పిల్లల ఆసుపత్రి లో చికిత్స పొందుతున్నారు. నెల్లూరు లోని ప్రైవేట్ చిన్న పిల్లల ఆసుపత్రుల్లో కూడ నాలుగైదు కేసులు నమోదయ్యాయి. వర్షాలు పడకముందే వ్యాధి విజృంభణ ఈ విధంగా వుంటే వర్షాలుపడ్డాక ఏ విధంగా వుంటుందో ఊహించలేం.

వ్యాధి నివారణకు వైద్య ఆరోగ్య శాఖ ప్రచారం తప్ప ముందు జాగ్రత్త చర్యలేవీ తీసుకోలేదు. వాక్సినేషన్, బెల్లడోనా వంటి మందులు కూడా పంపిణీ చేయలేదు.

ఈ వ్యాధికి కారకాలైన పందులను పట్టణానికి దూరంగా తరలించడంలో మునిసిపాలిటీ పూర్తిగా విఫలమయ్యింది. గత ఏడాది పందులు పెంచేవారికి ప్రత్యామ్నాయ ఉపాధి కోసం రుణాలు మంజూరు చేయగా లబ్ధిదారులు ఆ డబ్బుతో తిరిగి పందులనే కొన్నారు. రుణాలిచ్చారేగాని వాటిని ఏ విధంగా వినియోగించారో పరిశీలించే ఓపిక అధికారులకు లేకపోవడంతో ఈ వ్యవహారం గందరగోళంగా తయారయ్యి, పందుల సంఖ్య పట్టణంలో మరింతగా పెరిగింది.

## బందోబస్తులో వున్నాం - మామూళ్లివ్వండి!

బందోబస్తులో వుండే పోలీసులకు ప్రభుత్వం టి.ఏ., డి.ఏ ఇస్తుంది. కాని నెల్లూరు పోలీసులకు ఇది చాలడం లేదేమో మళ్లీ ప్రత్యేకంగాపలువురి వద్ద మామూళ్లు వసూలు చేశారు. కేంద్ర మంత్రి వెంకయ్య నాయుడు 1తేది నెల్లూరు టౌన్‌లో పదిహేనుకు పైగా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఇందులో కొన్ని ప్రైవేట్ కార్యక్రమాలున్నాయి. ఈ ప్రాంతాల్లో బందోబస్తులో వున్న పోలీసులు సందట్లో సడేమియాగా నెల్లూరు జిల్లా రైసు మిల్లర్ల అసోసియేషన్, ఆదిత్య కాలేజి నిర్వాహకులతోపాటు మరికొందరి వద్ద బలవంతంగా మామూళ్లు వసూలు చేశారట. దీనికోసం ప్రత్యేకంగా కొన్ని ఆటోలు వేసుకొని గ్రూపులుగా తిరిగారట. ఈ వ్యవహారం ఎంత అసహ్యం? దీనిపై దర్యాప్తు జరిపి బాధ్యులపై చర్య తీసుకోవాల్సిన అవసరం వుంది.



కనుమూరులో యాత్రీ నివాస్ శంకుస్థాపన సందర్భంగా జరిగిన సభలో మాట్లాడుతున్న రాష్ట్ర మున్సిపల్ మంత్రి ఫరూక్, వేదికపై నేతలు రామనారాయణ, వెంకయ్యనాయుడు, సుష్మాస్వరాజ్, వివేకా, అనంతకుమార్, ప్రభాకరరెడ్డి.

## పంచాయతీ రాజ్‌శాఖ ప్రతిపాదనలు 448కోట్లు

జిల్లాలో వివిధ అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టేందుకు వీలుగా కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖా మంత్రి వెంకయ్య నాయుడు కోరిన ప్రతిపాదనలు తయారు చేయడంలో పంచాయతీ రాజ్‌శాఖ ముందు నిలిచింది. ఆ శాఖ తరఫున వివిధ పనులను జిల్లా వ్యాప్తంగా ప్రతిపాదిస్తూ 448 కోట్లు వీటికి ఖర్చు కాగల అంచనాలను తయారు చేశారు. ఇందులో గ్రామీణ రోడ్లకు 109కోట్లు, పాఠశాలల భవనాలకు 124కోట్లు, గ్రంథాలయాల అభివృద్ధికి 18కోట్లు, సిమెంటు రోడ్లకు 112 కోట్లు ఖర్చుపెట్టాలని జిల్లా మంత్రికి సమర్పించిన నివేదికలో పేర్కొన్నారు. రోడ్లు భవనాల శాఖ, గ్రామీణ నీటిసరఫరాల శాఖ ఇంకా ప్రతిపాదనలు తయారు చేయాల్సి వుంది.

## కుప్ప తొట్టిలో పసికందు

తొమ్మిది మాసాలు కడుపులో దాచుకొని పెంచిన బిడ్డను ఓ తల్లి కుప్పతొట్టిలో పడవేసింది. నెల్లూరు కనకమహల్ సెంటర్‌లో గురువారం ఉదయం ఈ దయనీయ దృశ్యం కన్పించింది. వేకువజామున పడ్డ చినుకులకు ఈ బిడ్డ తడిచి ఏడ్వనారంభించింది. దారిన పోయే వారు చూస్తూ వెళ్లారేగాని ఎవరు ఆ పసికందును రక్షించాలని ప్రయత్నించ లేదు. అదే ప్రాంతంలోని గృహిణి ప్రభావతమ్మ ఆ బిడ్డను అక్కున చేర్చుకొని ప్రాథమిక చికిత్స చేయించింది. తన కున్న ఇద్దరు ఆడబిడ్డలతోపాటు ఈ బిడ్డను పెంచుతానని చెప్పింది. కన్న తల్లి కాఠిణ్యం ప్రదర్శించిన మరో తల్లి దయార్ద్ర హృదయం చూపడంతో చెత్తకుండీలో బిడ్డ బతికి బట్టకట్టింది.

## తెలుగుతీర్థం సేవించనున్న కల్పలత

గూడూరు మునిసిపల్ ఛైర్మన్ కోడూరు కల్పలత తెలుగు తీర్థం సేవించనున్నారు. ఈ నెల 9తేది కల్పలత, ఆమె భర్త మీరారెడ్డి తెలుగుదేశం పార్టీలో చేరుతారని ఆ పార్టీ జిల్లా కన్వీనర్ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి చెప్పారు. గూడూరు మునిసిపాలిటీలోని ఇండిపెండెంట్ కౌన్సిలర్లు కె. ఉదయకుమార్, వి. శ్రీనివాసులు, ఎం. గంగయ్య 2తేది ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాదరావు సమక్షంలో తెలుగుదేశం పార్టీలో చేరారు.

## ఉచిత వివాహ పరిచయ వేదిక

బ్రాహ్మణ ఉచిత వివాహ పరిచయవేదిక ఆర్టీసి బస్టాండ్ వద్ద గల రోటరీ కళ్యాణ మండపంలో 12తేది ఏర్పాటయ్యింది. బ్రాహ్మణ సంఘాల వారు, వివాహం కావాల్సిన వధూవరుల తల్లితండ్రులు దీనిలో పాల్గొని సంబంధాలు కుదుర్చుకోవాల్సిందిగా నిర్వాహకులు కోరుతున్నారు.

## పాలట్యాంకర్ బోల్తా- ఐదుమందికి గాయాలు

కోవూరు బైపాసు రోడ్డుపై గురువారం విజయడైరీ పాల ట్యాంకర్

కొరవ 7వ పేజీలో



నెల్లూరు మెక్లిన్ క్లబ్‌లో జరిగిన అంధుల చదరంగ పోటీలను ఆసక్తిగా చూస్తున్న ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి, కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి, మాడరన్ స్కూల్ విజయకుమార్ రెడ్డి

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

...కొట్టింది. దీనిలో ప్రయాణిస్తుండిన ఆసిఫ్, మల్లిఖార్జున, జావీద్, రమణయ్య, నజీర్‌లకు తీవ్రగాయాలయ్యాయి. చికిత్స నిమిత్తం వీరిని నెల్లూరు ప్రభుత్వాసుపత్రికి తరలించారు.

### రిక్విజిషన్ నోటీసుపై కౌన్సిల్ సమావేశం

నెల్లూరు మున్సిపల్ కౌన్సిల్‌లో పాదిమంజిల్ ప్రారంభోత్సవ వివాదం ఇంకా రగులుకుంటూనే వుంది. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చేత, సందానీ బాషా పాదిమంజిల్‌ను బలవంతంగా ప్రారంభింపచేశారని, చైర్‌పర్సన్ అనూరాధ ప్రభుత్వానికి ఫిర్యాదు చేసిన సంగతి తెలిసిందే. అర్థం పర్థంలేని ఈ పిటిషన్‌పై మున్సిపల్ పరిపాలనా వ్యవహారాల శాఖ సందానీబాషాకు షోకాజు నోటీసు జారీ చేసింది. పాదిమంజిల్ ప్రారంభోత్సవం, అధికారికమా, అనధికారికమా అన్న విషయమై కౌన్సిల్ ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి చర్చించాలని కాంగ్రెస్ కౌన్సిలర్లు ఇచ్చిన రిక్విజిషన్ నోటీసును చైర్‌పర్సన్ తిరస్కరించింది. దీనిపై చర్చ జరిగితే తానే ఇబ్బందుల్లో ఇరుక్కుంటానని తెలిసే చైర్‌పర్సన్ ఈ పని చేసింది. దీంతో మున్సిపల్ చట్టంలోని నిబంధనల ప్రకారమే, కాంగ్రెస్ కౌన్సిలర్లు కౌన్సిల్ ప్రత్యేక సమావేశం జరుపబోతున్నారు. చట్టం ప్రకారం రిక్విజిషన్ నోటీసులో సంతకం చేసిన మొదటి కౌన్సిలర్ ఊటుకూరు లక్ష్మయ్య సమావేశానికి అధ్యక్షత వహిస్తారు.

మెజారిటీ కౌన్సిలర్లు కోరిన ప్రత్యేక సమావేశానికి సంబంధించిన రిక్విజిషన్ నోటీసును తిరస్కరించిన తర్వాత, పోటీ కౌన్సిల్ సమావేశం ఏర్పాటు చేయడం అరుదైన విషయం. ఛైర్మన్ స్థానంలో ఉన్నవారికి అవమానకరమైన వ్యవహారం.

అనూరాధ గోటితో పొయ్యేదాన్ని గొడ్డలిదాకా తెచ్చుకుంటోంది. పాదిమంజిల్ వ్యవహారంలో ఆదాల ప్రారంభోత్సవాన్ని వివాదం చేసి దారిన పోయే శని నెత్తికి తెచ్చుకున్నానని ఆమెకు తెలిసినా, దాన్ని సరిదిద్దుకొనే ప్రయత్నం చేయక పోగా, ఇంకా తప్పులు చేస్తూనే ఉంది. ఇటీవల నెల్లూరుకు వచ్చిన మున్సిపల్ మంత్రి ఫరూక్ కూడా పాదిమంజిల్ ప్రారంభోత్సవం అధికారికమేనని కూడా చెప్పారు. షోకాజ్ నోటీసు వ్యవహారం తనకు తెలియదన్నాడట. మున్సిపల్ రాజకీయాల్లో రమేష్‌రెడ్డి జోక్యాన్ని తగ్గించమని కూడా అనూరాధకు సలహా ఇచ్చారట. హిత వచనాలను ఆమె చెవిన వేసుకొనే పరిస్థితిలో లేదు!

### హత్యజరిగిన వైన్‌షాపు లైసెన్సు రద్దు

నెల్లూరు టౌన్ రామలింగాపురంలో ఇటీవల హత్య జరిగిన శ్రీవైన్స్ లైసెన్సును రద్దు చేశారు. ఈ బ్రాంది షాపు వెనుక అనధికారికంగా ఏర్పాటు చేసిన బార్‌లో ఊటుకూరు శ్రీను అనే వ్యక్తి అక్టోబర్ 11తేది మద్యం సేవిస్తుండగా అతని ప్రత్యర్థులు హత్య చేశారు. ఎస్పీ బాధ్యతలు తీసుకొన్న రోజే ఈ హత్య జరగడంతో ఈ షాపును సందర్శించి ఎస్పీ ఇక్కడి లొసుగులు పరిశీలించి షాపు యజమానిపై కేసు నమోదు చేశారు. లూజు విక్రయాలపై ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్ అధికారులను వివరణ కోరడంతో వారు ఈ షాపు లైసెన్సును రద్దు చేస్తున్నట్లు వర్తమానం పంపించారు.

ఈ చర్యతో కలవరపడిన మద్యం షాపుల యజమానులు తమ అనధికార బార్లు నిర్వహించే స్థలాలను తాత్కాలికంగా మార్చారు. వీటిపై కూడ ఎస్పీ డేగ కన్ను ప్రసరింపజేస్తే టౌన్‌లో నగం రచ్చలు, రావిళ్లు తగ్గుతాయి.

### నెల్లూరులో వర్షం

చిత్తకార్తలో చినుకులు రాలక పోయినా స్వాతికార్తెలో జల్లులు కురుస్తున్నాయి. 2,3తేదీల్లో కురిసిన చిన్నపాటి వర్షానికి నెల్లూరు టౌన్‌లోని రోడ్లు నికృష్టంగా తయారయ్యాయి.

### మెక్సికోకు డాక్టర్ రాము

నెల్లూరు పొగతోటలోని మధుమేహ నిపుణుడు డాక్టర్ వై. రాము మెక్సికోలో జరిగే ఇంటర్నేషనల్ డయాబెటిక్ ఫెడరేషన్ - 2000 సమావేశానికి హాజరవుతున్నారు. నవంబరు 4తేది నుండి 11తేది వరకు ఈ సమావేశం జరుగుతుంది. ఈ సమావేశంలో రాము తన పరిశోధనాత్మక వ్యాసాన్ని సమర్పిస్తారు. డాక్టర్ రాము ఇదివరలో ఫిన్‌లాండ్, సింగపూర్, మలేషియా, థాయిలాండ్, స్పెయిన్, బెల్జియం దేశాల్లో జరిగిన డయాబెటిక్ సదస్సులో పాల్గొన్నారు.

### ఓటర్ల జాబితాలో పేర్లు నమోదు చేసుకోండి

కేంద్ర ఎన్నికల సంఘం ఓటర్ల జాబితాలను తిరిగి సవరిస్తుంది. నవంబర్ 1తేదికి 18 సంవత్సరాలు నిండిన వారు, ఓటర్ల జాబితాలో తమ పేరు లేని వారు ఎమ్మార్వో, ఆర్డీఓ కార్యాలయాల్లో ఫారం నెం.6 దాఖలు పర్చి తమ పేర్లు నమోదు చేసుకోవచ్చు. దీనికి చివరి గడువును నవంబర్ 30తేదీగా నిర్ణయించారు. అధికారులు ప్రకటించే కొన్ని ప్రత్యేక స్థలాల్లో నవంబర్ 11, 12, 25తేదీల్లో మార్పు, చేర్పులు, సవరణలు దాఖలు చేసుకోవచ్చు. వీటిపై గొడవలను డిసెంబరు 30తేదీలోగా పరిష్కరించుకోవచ్చు. ఓటర్ల తుది జాబితా ప్రచురణను 2001 జనవరి రెండవతేదీ చేస్తామని జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ చెప్పారు.

### జువాలజీలో పిహెచ్‌డి

విఆర్ కాలేజి జువాలజి డిపార్టుమెంట్‌లో పనిచేసే లెక్చరర్ పంచేటి ప్రసాదరావుకు ఎస్వీ యూనివర్శిటీ పిహెచ్‌డి పట్టా ప్రదానం చేసింది. 'కలుషితమైన మంచినీటిలో పెరిగే చేపల



కాలేయ జీవక్రియలపై పెస్టిసైడ్ ప్రభావం' అనే అంశంపై ప్రసాదరావు అధ్యయనం చేసి పరిశోధనా వ్యాసాన్ని సమర్పించారు. ఈ పరిశోధనను దివంగత ప్రొఫెసర్ ఎస్.గోవిందప్ప పర్యవేక్షణలో చేశారు.

### సత్యనారాయణ స్వామి వ్రతం

నెల్లూరు సంతపేట బ్రాహ్మణ వీధిలోని సత్యనారాయణ స్వామి మందిరంలో 11తేది కార్తీక పౌర్ణమిని పురస్కరించుకొని కళ్యాణోత్సవం, వ్రతం జరుపుతున్నారు. ఈ కార్యక్రమంలో భక్తులు పాల్గొనాలని నిర్వాహకులు కోరుతున్నారు.

### సూరం వెంకటకృష్ణయ్య మరణం

జమీన్‌రైతు ఉద్యోగి కోటేశ్వరరావు తండ్రి, గునుపాటి రామచంద్రారెడ్డి సంస్థానంలో విరామ మెరుగక పనిచేసిన వ్యక్తి, నమ్మకస్తుడు, నిజాయితీపరుడు, సూరం వెంకటకృష్ణయ్య (73) 28తేది నెల్లూరులో మరణించారు. కొంతకాలంగా కృష్ణయ్య క్యాన్సర్ వ్యాధితో బాధపడుతున్నారు. ఆయనకు భార్య, ఐదుగురు కుమార్తెలు, ఐదుగురు కొడుకులున్నారు.

వీరి కుటుంబానికి సహానుభూతి.

## సంస్మృతి



## ఆరుగుంట దశరథరామరెడ్డిగారు

**పరమపదించి 3.11.2000 తేదికి తొమ్మిది సంవత్సరాలు పూర్తవుతాయి.**

సుఖదుఃఖాలను
సమభావంతో
భగవత్ నిర్దేశితంగా
స్వీకరించి, సంతోషంగా
మనుగడ సాగించాలనే
మీ జీవితాదర్శం
మాకు ఆదర్శం కావాలి
ఆశీర్వదించండి!
దీవించండి!!

సంస్మరిస్తూ

**కుటుంబసభ్యులు**

# వాస్తు సరిలేక ద్వారక సముద్రంలో మునక!

దుర్గాలలో గిరిదుర్గం, స్థల దుర్గం, జలదుర్గం అని మూడు విధాలు. ఉదయగిరి, పెనుకొండ, గుత్తి గిరి దుర్గాలు; చంద్రగిరి, హంపి స్థలదుర్గాలు. కృష్ణుని ద్వారక జలదుర్గం. జల దుర్గాలు దేశంలో చాలా అరుదు.

కృష్ణుడు దేవకీ వసుదేవుల కుమారుడు. దేవకీదేవి కంసుని చెల్లెలు. ఈ వరుసన కృష్ణుడు కంసుడికి మేనల్లుడవుతాడు.

రాజకీయ కారణాల వల్ల కృష్ణుడు కంసుని సంహరిస్తాడు. కంసుని మామ జరాసంధుడు ఇలా శత్రువై కృష్ణుని రాజధాని 'మధుర'పై అనేక మార్లు దండెత్తి అపార నష్టం కల్గించాడు. అంచేత శత్రుదుర్భేద్యమైన దుర్గాన్ని నిర్మించవలసి వచ్చింది. సముద్రం చేత చుట్టబడివున్న 'రైవతకాద్రి'పై అంతకు ముందు కుశస్థలి అనే కోట శిథిలమైన చోట కృష్ణుడు ద్వారావతి, ద్వారక అనే పేర్లుగల నగరాన్ని నిర్మించాడు.

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

చుట్టూ నీటి వల్ల ఇది 'వారి దుర్గం' అయింది. ద్వారక మూడు పర్యాయాలు నిర్మించబడింది. కోటలోకి నీరురాకుండా చుట్టూ రాతి గోడలు పటిష్ఠంగా వుండేవి. కృష్ణుడు మరణించిన ఏడవ రోజు భూమి కంపించి గోడలు బ్రక్కలై 'ద్వారక' సముద్రం పాలయ్యింది.

ఈ విషయం మహాభారతంలోని మౌసల పర్వంలోనూ, భాగవతంలోనూ ప్రస్తావించబడింది.

### పరిశోధన!

నేటి బెట్ ద్వారక ప్రాంత సముద్రంలోని 150 అడుగుల లోతులో 'ద్వారక' శిథిలాలు లభ్యమయ్యాయి. ఈ విషయమై శ్రీ ఎస్.ఆర్.రావు, హరిప్రసాద్ శాస్త్రి విశేషమైన కృషి చేశారు. ఫలితంగా సముద్ర విష్ణువు ఆలయ శిథిలాలూ, ఓడ లంగర్లూ, రాగి నాణాలు, మృణ్మయ పాత్ర శకలాలు త్రవ్వకాలలో లభ్యమయ్యాయి.

### శ్రీకృష్ణుని గురించి

కృష్ణుడి వ్యూహం లేనిదే, ఆయన ప్రణాళిక లేనిదే పాండవ విజయం లేదు. వారికి రక్షణా లేదు. శ్రీకృష్ణుడు తన 81 సంవత్సరంలో, భారత యుద్ధంలో పాల్గొని ధర్మరాజుని చక్రవర్తిగానూ, భీముణ్ని యువరాజుగానూ అభిషేకించి ఆ తర్వాతే 36 సంవత్సరాల తర్వాత కృష్ణుడు పరమ పదాన్ని పొందాడు. కృష్ణుడికి అష్టభార్యలు. వారు 1.రుక్మిణీ దేవి 2.సత్యభామ 3.కాళింది 4.జాంబవతి 5.భద్ర 6.సుదంత 7.లక్ష్మణ 8.మిత్రవింద

వీరిలో రుక్మిణి కుమారుడు అనిరుద్ధుడు. ఇతడి భార్య బాణాసురుడి కుమార్తె ఉష. ఆ తర్వాత కృష్ణుని కుమారుడైన సాంబుడు జాంబవతి కుమారుడు. వీరిద్దరూ కూడా భారత యుద్ధం తర్వాత భోజుల చేత (యాదవులలో ఒక వర్గం) వధింపబడతారు.

### ఇక ద్వారక గురించి

ద్వారక విస్తీర్ణం 13 యోజనాలని ఆధారాల కథనం. రైవతకుడనే మనువు వంశస్థుడు పూర్వం ద్వారక స్థలంలో 'కుశస్థలి'ని నిర్మించాడు. అప్పటికే అది ఒక ప్రాచీన, నగర శిథిలాలపై నిర్మించిన కోట. ఆ తర్వాత కృష్ణుడు మయుని సాయంతో ద్వారకను నిర్మించాడు.

యుద్ధం తర్వాత 36 సంవత్సరాలకు కృష్ణుడు మరణిస్తే - కృష్ణ మరణం తర్వాత ఏడవ రోజు ద్వారక మునిగిపోయింది. మరణ సమయానికి (అప్పటికి) కృష్ణుని వయస్సు 117 సంవత్సరాలు. ద్వారక శిథిలాలు 1985 సంవత్సరం నుంచి జరిపిన సముద్ర పరిశోధనలు త్రవ్వకాల వల్ల బెట్ ద్వారక ప్రాంతంలో, సముద్రంలో 150 అడుగుల లోతున లభించడం వల్ల, ఆ శిథిలావశేషాల వల్ల అనేక చారిత్రకాంశాలు ద్యోతకమవుతున్నాయి.

### వాస్తు విధ్వంసం!

బెట్ ద్వారక దక్షిణ, పశ్చిమాలు పల్లమై 'పీడనాస్థితి'ని కలుగజేశాయి. రైవతకాద్రి 'ఉత్తుంగశిలారోహణ'మై నప్పటికీ పశ్చిమ, దక్షిణ రాతి గోడలు 'నీచమై' సమస్థితికి తిలోదకాలిచ్చాయి.

తూర్పు, ఉత్తరాల వారి స్థితి (జలస్థితి). దక్షిణ పశ్చిమాల్లోనూ 'సమతుల్యత' సాధించనప్పుడు ద్వీపం దక్షిణ స్థానంవైపు ఆకర్షింపబడుతుంది. యదుస్థానం జలోన్నతమవుతుంది. వరుణ స్థానం విజృంభించి స్థితిని అతలా కుతలం చేస్తుంది. అందువల్ల ద్వారక అయినా, శ్రీలంక అయినా మరే యితర డయ్యూడామన్, లక్షద్వీపాలాంటి ద్వీపాలకైనా ఈ పరిస్థితి తప్పదు. ఏ ఒక్కవైపు సమతల భూభాగం సమస్థితిని సాధించినా ఈ పరిస్థితి వచ్చేది కాదు. అదీగాక మహర్షాతకుల అంతంతో ఆ రాజ్యాలూ అంతమవుతాయన్న ఉవాచ వుండనే వుంది.

## ఉదయగిరి

5వ పేజీ కొరవ

పూజలు చేశారు. వెంకయ్యనాయుడు, మస్తానయ్య సమాధిపై ప్రత్యేకంగా తెచ్చిన 'చద్దర్'ను కప్పారు. తన రాకకు గుర్తుగా ఒక చంద్ర వంకను దర్గాకు బహూకరించారు. తనకు చిన్నప్పటి నుంచి దర్గా వచ్చే అలవాటుందని సహచర మంత్రులకు చెప్పారాయన. కసుమూరు చెరువుకు సమీపంలో పర్యాటక శాఖ నేతృత్వంలో 25లక్షలు వెచ్చించి నిర్మింపతలపెట్టిన అతిథి గృహాలకు కేంద్ర పర్యాటక శాఖ మంత్రి అనంతకుమార్ శంకుస్థాపన చేశారు. అనంతరం రాపూరు శాసనసభ్యుడు రామనారాయణరెడ్డి అధ్యక్షతన సభ జరిగింది. రామనారాయణరెడ్డి కసుమూరు కాల్వ సమస్య పరిష్కరించవలసి వెంకయ్య నాయుడ్ని కోరారు. రాష్ట్ర పట్టణాభివృద్ధి శాఖ మంత్రి ఎం.డి.ఫరూక్ మాట్లాడుతూ కసుమూరు దర్గాకు వచ్చే ఆదాయం, ఈ ప్రాంతాభివృద్ధికే ఖర్చు పెట్టను ప్రయత్నిస్తానన్నారు.

సుష్మాస్వరాజ్ మాట్లాడుతూ వెంకయ్య నాయుడు నాకు సోదర సమానుడు. ఆయన తొలిసారిగా జిల్లా పర్యటనకు వస్తున్నప్పుడు ఖాళీ చేతులతో ఎందుకు పంపాలన్న ఉద్దేశ్యంతో ఉదయగిరిలో కోటి రూపాయల విలువ చేసే టి.వి. ట్రాన్స్‌మీటర్‌ను ఏర్పాటు చేశానన్నారు. అదే విధంగా మరో మంత్రి అనంతకుమార్ కూడా 25లక్షల యాత్రీ నివాస్‌ను మంజూరు చేసినట్లు చెప్పారు. కేంద్ర పర్యాటక మంత్రి అనంతకుమార్ వచ్చీరానీ తెలుగులో మాట్లాడారు. నాది కన్నడ, తెలుగు. నా నియోజక వర్గం బెంగుళూరులో 30 శాతం మంది నెల్లూరీయులున్నారు. మీ ప్రాంతానికి వెళ్లి ఒక మంచి పని చేసివచ్చానంటే నాకు ఓట్లు పడతాయి. కసుమూరులో అతిథి గృహాలకు మరో 25లక్షలు అదనంగా మంజూరు చేస్తానన్నారాయన. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మాట్లాడుతూ రాజకీయాల్లో నాకు వెంకయ్య నాయుడు ఆదర్శం. గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రిగా ఆయన గ్రామ ప్రాంతాలను మరింతగా అభివృద్ధి చేయగలడన్న ఆత్మ విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. వెంకయ్య నాయుడు మాట్లాడుతూ గ్రామాలవైపు తరలమని గాంధీజీ చెప్పారు. ఆ నినాదంతోనే నా శాఖాధికారులను గ్రామాలవైపు దృష్టి సారించమని చెప్పాను. అభివృద్ధి నా మంత్రం; అందర్నీ కలుపుకొని పోవడం నా నినాదం. రాజకీయాలతో నిమిత్తం లేకుండా జిల్లా అభివృద్ధి కోసం శ్రమిస్తాను. వెంకయ్య నాయుడు హయాంలో జిల్లా అభివృద్ధి జరిగిందని అందరూ చెప్పుకొనేలా చేస్తానన్నారు. ఎమ్పీ రాజేశ్వరమ్మ, నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ వేదికపై ఆశీనులయ్యారు.

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

దడంతో రైతులు నీటికోసం పాట్లు పడుతున్నారు. మానవతా దృష్టితో ఈ ప్రాంత రైతులకు తెలుగుగంగ నీటిని విడుదలచేయాల్సి వుంది.

### ఔత్సాహిక లెక్చరర్ రిటైర్డ్ అయ్యారు

వెంకటగిరి విశ్వోదయ ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో గత 30 సంవత్సరాలుగా బాటనీ లెక్చరర్‌గా పనిచేసిన బి.సూర్యనారాయణ రిటైర్ అయ్యారు. సూర్యనారాయణ ఉత్సాహవంతుడైన వ్యక్తి. వెలిగొండ, శ్రీహరికోట ప్రాంతాల్లో వెయ్యికిపైగా ఔషధ మొక్కలను గుర్తించి వాటిని ప్రభుత్వ కాలేజీలోని రీసెర్చ్ సెంటర్‌లో చేర్చారు. ఈ రీసెర్చ్ సెంటర్‌లో పరిశోధనలు చేసి నల్గురు విద్యార్థులు పి.హెచ్.డి. డిగ్రీ పొందారు. రీసెర్చ్ సెంటర్‌ను స్వంత ఖర్చుతో సూర్యనారాయణ ఏర్పాటుచేశారు.



నెల్లూరులో ఆదిత్య కాంప్లెక్స్ భవన సముదాయానికి శంకుస్థాపన చేస్తున్న కేంద్రమంత్రి వెంకయ్యనాయుడు. నిలబడి చూస్తున్నవారు తాళ్లపాక అనూరాధ, ఎమ్పీ రాజేశ్వరమ్మ, ఎమ్మెల్యే వేణుగోపాల రెడ్డి, వివేకానందరెడ్డి, ఆచార్య ఆదిత్య తదితరులు.

### మెదడువాపు వ్యాధితో బాలుని మృతి

ఆత్మకూరు మండలం బసవరాజు పాళెం గ్రామానికి చెందిన గిరిజన బాలుడు వెంకట రమణయ్య (4) మెదడు వాపు వ్యాధితో మరణించాడు. దీంతో గ్రామస్తులంతా హడలిపోతున్నారు. గ్రామానికి రెండు కిలోమీటర్ల దూరంలో మహిమలూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వున్నా డాక్టర్ కాని, ఎ.ఎన్.ఎంలు కాని అక్కడకు వెళ్లి, చనిపోయిన బాలుడి వివరాలు సేకరించలేదు. పై అధికారులకు ఈ విషయమై వివరణా పంపలేదు. గ్రామంలో ముందు జాగ్రత్త చర్యలు తీసుకోలేదు. బసవరాజుపాళెంలో పారిశుధ్య పరిస్థితులు పాతరేసినట్లున్నాయి. పందుల బెడద కూడా ఎక్కువగా ఉంది. ప్రభుత్వం తక్షణం స్పందించి ముందు జాగ్రత్తలు తీసుకోకుంటె గ్రామంలో మరిన్ని మరణాలు నమోదు కావచ్చు.

### దోపిడీల నివారణకు ప్రత్యేక పోలీసు

అర్ధరాత్రి వేళల్లో జాతీయ రహదారులపై జరుగుతున్న దోపిడీల నివారణకు 'డెకాయిన్' పద్ధతిని ప్రవేశ పెడుతున్నట్లు ఎస్పీ శ్రీనివాసరెడ్డి చెప్పారు. బుచ్చిరెడ్డిపాళెం స్టేషన్ తనిఖీకి వచ్చిన ఎస్పీ విలేఖరులతో మాట్లాడారు. గతంలో దోపిడీల నివారణకు బస్‌లో ఎస్కార్ట్‌లను నియమించేవారమని, ఈ పద్ధతిలో లోటుపాట్లుండడం వల్ల డెకాయిన్ పద్ధతి ప్రవేశపెడుతున్నామన్నారు. ఈ పద్ధతిలో పోలీసులు దూర ప్రాంతాలకు వెళ్లే వాహనాల్లో ప్రయాణీకుల మాదిరి కూర్చొంటారు. వీరి వద్ద పిస్టల్ వంటి ఆయుధాలుంటాయి. దొంగలు బస్సును ఆపినప్పుడు వీలైనంత వరకు లొంగిపొమ్మంటారని, లేని పక్షంలో ఆయుధాలకు పనిచెబుతారన్నారు. పరిస్థితి చేయిదాటినప్పుడు దొంగలను కాల్చివేసే అధికారం ఈ మఫ్టీ పోలీసులకు ఉంటుందన్నారు. ప్రజలు సహకరిస్తే దొంగ తనాలే లేకుండా చేయవచ్చన్నారు. ప్రజలు సంఘటితంగా ప్రతిఘటించడం వల్లే ఇందుకూరుపేటలో ఒక దోపిడి దొంగ ప్రాణాలు కోల్పోయాడని ఎస్పీ వివరించారు.

### పినాకినీబ్యాంక్ డిపాజిట్లు

2000 - 2001 ఆర్థిక సంవత్సరానికి పినాకినీ గ్రామీణ బ్యాంక్ 260 కోట్ల రూపాయలు డిపాజిట్లు సేకరించాలని లక్ష్యంగా పెట్టుకొన్నట్లు ఆ బ్యాంక్ ఛైర్మన్ శ్రీహరిప్రసాద్ వెల్లడించారు. బుచ్చిమండలం జొన్నవాడ గ్రామంలో బ్యాంకు శాఖను సోమవారం ప్రారంభించి జమీన్‌రైతు విలేఖరితో ముచ్చటించారు. పినాకినీ గ్రామీణ బ్యాంక్‌లో ఫిక్సెడ్ డిపాజిట్ల కంటె సేవింగ్స్ బ్యాంక్ డిపాజిట్లపై ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నామన్నారు. అందులో భాగంగా ఈ యేడాది 260 కోట్ల లక్ష్యంలో 100 కోట్లు సేవింగ్స్ బ్యాంక్ డిపాజిట్ల రూపంలో సేకరించాలని లక్ష్యంగా పెట్టుకొన్నట్లు చెప్పారు. ఈ డిపాజిట్లు పెంచేందుకు గాను అక్టోబర్ 11తేది నుంచి నవంబర్ 15 వరకు స్పెషల్ క్యాంపులు నిర్వహిస్తున్నామని వివరించారు. రాష్ట్రంలో పినాకినీ గ్రామీణ బ్యాంక్‌కు 85 శాఖలున్నాయని, వీటిలో 57 శాఖలు ఒక్క నెల్లూరు జిల్లాలోనే ఉన్నాయన్నారు. బుచ్చిరెడ్డిపాళెం, ముత్తుకూరు, తోటపల్లిగూడూరు, ఇందుకూరుపేట మండలాల పరిధిలో రొయ్యలసాగు కోసం రుణాలడుగుతున్నారని, సాంకేతిక కారణాల వల్ల వీటిని ఇవ్వలేక పోతున్నామన్నారు. జూలై, ఆగష్టు, సెప్టెంబరు నెలల్లో జరిగిన స్పెషల్ డ్రైవ్ వల్ల 4.5 కోట్ల రుణాలు రికవరీ చేశామన్నారు. త్వరలో పొదలకూరు, ఆత్మకూరు, నార్తురాజుపాళెంలలో తమ బ్యాంక్ శాఖలు ఏర్పాటు చేస్తామన్నారు.

### డిపో మేనేజర్ బదలీ

ఆత్మకూరు ఆర్టీసి డిపో మేనేజర్ వై. శ్రీనివాసరావును చీరాల డిపో మేనేజర్‌గా బదలీ చేశారు. శ్రీనివాసరావు డిపో మేనేజర్‌గా పని చేసింది కొద్ది కాలమైనా డిపోను అభివృద్ధి పథంలో పయనింప చేశారు. డిపో ప్రస్తుతం 40 లక్షల రూపాయల ఆదాయంతో నడుస్తున్నది.

### తుమ్మగుంటలో కార్తీక మాస పూజలు

విడవలూరు మండలంలోని తుమ్మగుంటలో వెలసియున్న అయ్యప్ప స్వామి ఆలయంలో నవంబర్ 11తేది కార్తీక పౌర్ణమి సందర్భంగా ప్రత్యేక పూజలు జరుగుతాయి. ఈ పూజల్లో మహాన్యాస అభిషేకాలు, లక్ష్మీపూజ, కృతికాదీప దర్శన కార్యక్రమాలుంటాయని నిర్వాహకులు చెప్పారు.



వయసు పిలుస్తోంది.. రా! చిత్రంలో సఖి, దినేష్.

# మీనా దూరాలోచన!

ఇటీవల మీనా అర్జునుడు, తెనాలి చిత్రాల్లో ఒక్కొక్క పాటలో నర్తించింది. ఈ పాటలకు మంచి స్పందన వచ్చింది. దీంతో పలువురు నిర్మాతలు తమ చిత్రాల్లో ఒక్కపాటైనా చెయ్యమని మీనాను అడుగుతున్నారట. తన దగ్గరకొచ్చే నిర్మాతలకు తెలివిగా మీనా ఒక షరతుపెట్టింది. అదేమిటంటే, తాను నటించే పాటను విదేశాల్లో తీయమంటుందట. ఈ గొంతెమ్మ కోర్కె తీర్చలేక నిర్మాతలు వెనక్కు వెళ్తున్నారట. గతంలో విదేశాల్లో తీసిన సినిమాల్లో నటించని మీనా పాటల పేరుతో దూర దేశాలు చూడను 'దురాలోచన' చేసినట్లుంది.

## నా కూతుర్ని మంచి హీరోయిన్‌ను చేస్తాను

పలు సినిమాల్లో వాంప్‌గా నటించిన అనూరాధ తన కుమార్తె అభినయశ్రీని మంచి హీరోయిన్‌ను చేయాలని తహతహలాడుతుంది. అంతరంగాలు సీరియల్ గ్యాప్‌లో ముచ్చటిస్తూ హీరోయిన్‌గా చిత్ర రంగానికి వచ్చిన నేను, హీరోయిన్‌గా నిలబడలేకపోయాను, నా కుతూర్ని మంచి హీరోయిన్‌గా నిలబెట్టాలని తపనపడుతున్నాను. సినిమా ఫీల్డ్‌లో రెండు దశాబ్దాలుగా వున్న ఆర్టిస్టును; నన్ను ఆదరించినట్లే చిత్ర పరిశ్రమ నా కూతుర్ని ఆదరిస్తుందనే నమ్మకంతో వున్నానన్నారు. అభినయశ్రీ క్లాసికల్ డాన్స్, సినిమా డాన్స్‌ను బాగా నేర్చుకొంది. ఇంకా నేర్చుకొంటుంది. తనంతతానే యాక్టింగ్ ప్రాక్టీస్ చేసుకొంటుంది. ప్రాక్టీసులో ఎక్కడా విసుగూ, విరామం లేదు. ఈ వయస్సులో గ్లామర్ పాత్రలు చేస్తేనే బాగుంటుందని తాను సలహాయిచ్చినట్లు అనూరాధ చెప్పింది.

## కలల్లో కోరుకొనేది సాధించే రవీనా

ప్రతి మనిషికి భవిష్యత్తు గూర్చి కలలు కనటం ఇష్టం. ఆ కల్లో అయినా




ఇష్టపడే దాన్ని కైవసం చేసుకోవచ్చు అని చెబుతోంది రవీనా. 'ఆకాశవీధిలో' చిత్రంలో ప్యాచ్‌వర్క్‌లో పాల్గొనను హైదరాబాద్ వచ్చినప్పుడు ఈ విషయమై మాట్లాడింది. నేను జీవితంలో అనుకొన్నవి ఎన్నో సాధించలేకపోయాను. నాకు ఖా ళీ సమయం దొరికితే నిద్రపోవడం అలవాటు. ఆ నిద్రలో కమ్మని కలలు కంటుంటాను. జీవితంలో సాధించలేనివి కలల్లో సాధించేస్తుంటానని చెప్పింది.

* * *

# ముఖానికి రంగు పూయను : ఆమని

పెళ్లి చేసుకొన్న మరుసటి సంవత్సరంలోనే మళ్లీ ముఖానికి రంగు పూసుకోవాలని తహతహలాడే హీరోయిన్లు పలువురున్నారు. కాని 70 చిత్రాల్లో నటించి తెలుగులో వరుసగా మూడుసార్లు ఉత్తమనటిగా అవార్డు పొందిన ఆమని మంచి ఫాలోయింగ్ వున్నప్పుడే హీరోయిన్‌గా చాలించుకొంది. రెండున్నరేళ్ల క్రితం ప్రముఖ తమిళ నిర్మాత ఖాజా మొహిద్దీన్‌ను ప్రేమ వివాహం చేసుకొన్న ఆమని ఇటీవల నిర్మాత అవతారమెత్తింది. ఈ సందర్భంగా మాట్లాడుతూ సహజంగా సినిమా వారి సంసారం సజావుగావుండదంటారు. కాని నటిగా నిజ జీవితంలో మంచి భర్త లభించడం అదృష్టంగా భావిస్తున్నాను. ఏదో వేడి మీద నిర్ణయాలు తీసుకోవడం, వెంటనే విడిపోవడం వంటివి నా పెళ్లి విషయంలో లేవు. మా వారికి నాకన్నా ఓర్పు, సహనం ఎక్కువ. ఆయన ముస్లిం అయినా ఏ సమస్యా లేదు. ఇంట్లో అన్ని పండుగలు చేసుకొంటాం. నటిగా మంచి చిత్రాల్లో నటించానన్న తృప్తి నాకు వుంది. ఉన్నంతలో చాలనుకొనే మనస్తత్వం నాది. సంతృప్తిగా వున్నాను. ఇక పొరపాటున కూడా ముఖానికి రంగు పూసుకోను. మా ఆయన నిర్మాత కాబట్టి నాకున్న అనుభవం బట్టి సహ నిర్మాతగా ఆయనకు సహకరిస్తూ కాలం గడిపేస్తానంటుంది.

## ముంతాజ్‌వైపు మొగ్గు

తమిళ చిత్రాల్లో ఇద్దరు హీరోయిన్లుంటే గ్లామర్ పాత్రలకు రంభను లేదా, సిమ్రాన్‌ను ఇది వరకు బుక్‌చేసేవాళ్లు. ఇప్పుడు గ్లామర్ పాత్రలకు ఎక్కువగా ముంతాజ్‌ను పిలుస్తున్నారు. కారణం ఏమిటంటే; యాభైశాతం చూపిస్తేచాలు అంటే, మూటయాభై శాతం గ్లామర్‌ను చూపిస్తోందట. షూటింగ్స్ దగ్గర చూసే వాళ్లకే కళ్లు చెదరి పోతున్నాయంటున్నారు. ఇప్పుడంతా ఆమె 'అన్ లిమిటెడ్ మీల్స్' ముంతాజ్ అంటున్నారు.

## కరీనా పారితోషికం 90లక్షలు

కహోనా ప్యార్‌హై చిత్రం విడుదల తర్వాత అమీషాపటేల్ పన్నెండు చిత్రాలకు సైన్ చేసింది. ఒక్కొక్క చిత్రానికి ఇరవై ఐదు లక్షల రూపాయలు పారితోషికం తీసుకొంది. సునీ ససూర్‌జీ, ఘాయల్ చిత్రాల తర్వాత తన పారితోషికం నలభై లక్షలంటుంది. రెఫ్యూజీ చిత్రంలో నటించినందుకుగాను 60 లక్షలు తీసుకొన్న కరీనా కపూర్, ఆ చిత్రం విజయం సాధించాక తన రేటును అమాంతంగా 90లక్షలు చేసింది. రింకీ ఖన్నా 18 లక్షలు తీసుకొంటుండగా, తెలుగులో తొలిప్రేమ చిత్రానికి చాలా తక్కువ పారితోషికం తీసుకున్న కీర్తిరెడ్డి, ఈ చిత్రం హిందీ వెర్షన్ హిట్ కావడంతో తన పారితోషికం 15లక్షలకు పెంచేసింది.

# విషాదం చూడను వల్లకాదంటున్న రంభ!

సినిమాల్లో హీరో, హీరోయిన్లకు సంబంధించి క్లైమాక్స్ ట్రాజెడీగా వుంటే అసలు భరించలేనంటుంది గ్లామర్ హీరోయిన్ రంభ. క్లైమాక్స్ విషాదంగా వుందని తెలిస్తే ముందుగానే బయటకు లేచి వచ్చేస్తాను. శ్రీదేవి, కమల్‌హాసన్ నటించిన వసంత కోకిల చిత్రాన్ని ఎన్నోసార్లు చూశాను. కాని చివరి సన్నివేశం ఎప్పుడూ చూడలేదు. నేను నటించిన చిత్రాల్లో క్లైమాక్స్ విషాదంగా వుంటే గుండె నిబ్బరం చేసుకొని చేస్తానంటుంది.

## బాధలో రజనీకాంత్

రజనీకాంత్ ప్రస్తుతం పూర్తిగా బాధలో మునిగి పోయివున్నారు. రాజ్‌కుమార్ కిడ్నాప్ వ్యవహారమే ఇందుకు కారణమనాలి. ఈ సీజన్‌లో రజనీకాంత్ చిత్రం ప్రారంభం కావాల్సి వుంది. ఈ సమయంలోనే రాజకుమార్ కిడ్నాప్‌కు గురయ్యారు. రజనీకాంత్ స్వతహాగా కర్నాటకకు చెందిన వ్యక్తి. కర్నాటకలో షూటింగులు ఆగిపోయిన తరహాలోనే రజనీకాంత్ తన సినిమా ప్రారంభాన్ని ఆపుకొన్నారు. తన అభిమానియైన స్మగ్లర్ వీరప్పన్ దగ్గరకు నక్కీరన్ ఎడిటర్ గోపాల్ ద్వారా తన మాటలను కూడా చెప్పి పంపారు రజనీకాంత్. కాని వీరప్పన్ ఆ మాటలను పట్టించుకోకపోయేసరికి పూర్తి మౌనాన్ని ధరించి వున్నారాయన.

# అమ్మో! ఒకటో తారీఖు : ఒకసారి చూడొచ్చు!

ఉద్యోగాలు చేసే వారికి ఒకటో తారీఖున జీతాలు వస్తుంటాయి. ఒకటోతేది జీతాలు తీసుకొనే వారిలో పెద్ద ఉద్యోగస్తులుంటారు. మధ్యతరగతి, చిన్న తరగతి ఉద్యోగస్తుంటారు. ఒకటో తారీఖున జీతాలు వస్తున్నాయనగానే మధ్య తరగతి ఉద్యోగస్తులు భయపడిపోతారు. ఎందుచేత నంటే ఆ రోజు పనివాళ్లు, పాలవాళ్లు, చాకలివాళ్లు, చిల్లర కొట్టువాళ్లు, ఇతర అప్పుల వాళ్లు ఇంటి వద్ద హాజరవుతారు. వీరందరికి ఇచ్చేందుకు జీతం చాలదు. అందుకే మధ్య తరగతి జీవితాల వాళ్లు "అమ్మో! ఒకటోతారీఖు" అని భయపడుతారు. ఈ అంశాన్ని ఆధారం చేసుకొని ఎ.ఎ.ఆర్ట్సు సంస్థ, ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో "అమ్మో! ఒకటో తారీఖు" పేరున చిత్రం నిర్మించింది. కథ సత్యనారాయణ వ్రాశాడు.

మధ్యతరగతి కుటుంబ వాతావరణాన్ని ఈ చిత్రంలో ప్రతిబింబింపచేశాడు దర్శకుడు. మధ్యతరగతి వారు పడే కష్టాలు, ఎదుర్కొనే సమస్యలు, ఇబ్బందులు, ఆత్మాభిమానం, స్వార్థం, అహంకారం, జీవన పోరాటం, ఏడుపులు, నవ్వులు ఇవ్వన్నీ చూపబడ్డాయి. చర్చించబడ్డాయి. సక్రమ మార్గంలో వాటికి పరిష్కార మార్గాలు చూపబడ్డాయి. ఇందుకోసంగా రెండు మధ్య తరగతి కుటుంబాలు తీసుకోబడ్డాయి. ఒకటి గోవిందరావు కుటుంబం (ఎల్బీ. శ్రీరాం), రెండవది భీముడు (చలపతి రావు) కుటుంబం. గోవిందరావు ఆర్టీసి బస్సు డ్రైవరు. అతనికి నలుగురు ఆడపిల్లలు. ఒక మగ పిల్లాడు. సంపాదించేది మాత్రం అతను. అతని పెద్ద కూతురు గాయత్రి (రాశి) మాత్రమే. రెండో కూతురు ధనలక్ష్మికి (ప్రేమ) పెళ్లయ్యింది. భర్త ప్రోద్బలంతో ప్రతి నెలా ఒకటోతారీఖున డబ్బు పంపమని




తండ్రి గోవిందరావుకు జాబులు వ్రాస్తుంది. ఆ కూతురు సంసారం నిలపటం కోసం పంపక తప్పదు. మూడో అమ్మాయి విధవ. ఆ అమ్మాయి ఒకతని వలలో చిక్కి (తనికెళ్ల భరణి) మోసపోతుంది. నాలుగో అమ్మాయి తెలివి గల్లది. పెద్ద చదువులు చదివిస్తే, అంత కంటే పెద్ద చదువు చదివిన అబ్బాయిని, పెద్ద కట్నమిచ్చి తెచ్చి పెళ్లి చెయ్యాలేక ఆ అమ్మాయి చదువు మాన్పిస్తాడు. ఇక కుమారుడు కిరణ్ (సురేష్) నిరుద్యోగి. డబ్బున్న అమ్మాయిని పెళ్లాడాలని ప్రయత్నించి, పప్పులో కాలేసి ఒక పని మనిషిని పెళ్లాడి తీరని సమస్యగా తయారవుతాడు. గోవిందరావుకు ఒక తాత వున్నాడు (కోట శ్రీనివాసరావు). అతను స్వార్థపరుడు, అహంకారి. అతనొక తలనొప్పిగా తయారవుతాడు. ఇలాంటి పరిస్థితుల్లో గోవిందరావు జీవితపు రెండు అంచులు, తనకు వచ్చే జీతంతో ముడి వెయ్యాలంటే ఎలా వీలు పడుతుంది?

రెండో కుటుంబంలోని యజమాని భీముడు రిక్షా తొక్కి సంపాదిస్తాడు.

తరువ 11వ పేజీలో

# వారఫలాలు

*4-11-2000తేది నుండి 10-11-2000తేది వరకు వృషభంలో వక్ర గురు, శనులు; మిథునంలో రాహువు; ధనుస్సులో కేతువు; తులలో రవి, బుధులు; వృశ్చికంలో 6తేది వరకు, పిదప ధనుస్సులో శుక్రుడు; కన్యలో కుజుడు; మకర, కుంభ, మీన, మేషాలలో చంద్రుడు.*

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థికస్థితి, ఆదాయం సామాన్యంగా ఉంటుంది. ఆరోగ్యం కూడా సరిగా ఉండదు. స్థిరాస్తులపై స్వల్ప లాభాలుంటాయి. వ్యవసాయ రంగంలో వారు జాగ్రత్తపడాలి. సొంత పనులను డబ్బు, పలుకుబడితో సాధించుకున్నా కొద్ది సమస్యలు నిలబడి ఉంటాయి. అవసరాలకు అప్పు చేయవలసి రావచ్చును. బంధు, మిత్ర వర్గం సహాయం పొందుతారు. ఉద్యోగులు శ్రమపడతారు. అధికారుల అనుకూలత బాగుంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది.

### వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆర్థికస్థితి బాగుంటుంది. ఆదాయం పెరుగుతుంది. అయినా అనవసర ఖర్చులు తప్పవు. కొత్త కార్యక్రమాలు ప్రారంభిస్తారు. అనుకున్న పనులు ఇతరుల సహకారంతో సక్రమంగా జరుగుతాయి. సొంత ఆలోచనలను ఆచరణలో పెట్టగలరు. అధికార వర్గ సహకారం. మంచి పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది.

### మిథునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం, ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్ర వర్గంతో విభేదాలు సర్దుకుంటాయి. వారాంతంలో శుభవార్తలు వింటారు. రావలసిన బాకీలు, బ్యాంకు ఋణాలు ఆలస్యం కావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

### కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

ఈ రాశి వారికి ఆర్థికంగా బాగుంటుంది. కొత్తవాణిజ్య, కాంట్రాక్టుల వంటి కార్యక్రమాలు చేపడతారు. పెట్టుబడి పెట్టేవారికి అవకాశాలు వస్తాయి. సొంత పనులను పలుకుబడితో, డబ్బుతో సాధిస్తారు. బంధుమిత్రులతో వారాంతంలో కాలక్షేపం చేస్తారు. కొత్త వస్తువులు కొంటారు. సాంకేతిక విద్యగల వారికి ఉద్యోగావకాశాలు లభిస్తాయి. దూర ప్రయాణాలుంటాయి. ఉద్యోగులకు స్థానమార్పులుండగలవు. విద్యాప్రగతి బాగుంటుంది.

### సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం పెరుగుతుంది. ఆర్థికస్థితి బాగుంటుంది. వ్యవసాయ, వ్యాపారస్తులకు కొత్త పెట్టుబడులకు, ఋణాలకు అవకాశాలు అందుతాయి. అధికారుల సహకారం ఉద్యోగులకు కూడా బాగుంటుంది. బంధుమిత్రుల ద్వారా ఆర్థిక సహకారం పొందుతారు. కొత్త వస్తువులు, స్థిరాస్తుల కొనుగోలు ప్రయత్నాలుంటాయి. రాజకీయ, సాంకేతిక వర్గాలకు అవకాశాలు, ఆహ్వానాలు అందుతాయి. వారాంతంలో ఆరోగ్య లోపం కలుగవచ్చును. జ్వరాది బాధలుంటాయి. కుటుంబ సభ్యుల మధ్య చిన్న చిన్న విభేదాలు కలుగవచ్చును.

### కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

తొందరపాటు ఎక్కువ కావడం వల్ల చిక్కులు కలగవచ్చును. జాగ్రత్త పడాలి. ఈ రాశి వారికి ఆర్థికస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. అయితే కొన్ని అదనపు అవసరాలకు అప్పు చేయవలసి రావచ్చును.

## పంచాంగం

**విశాఖకార్తె**

తేది 6 విశాఖ కార్తె ప్రారంభం.

**ముహూర్తాలు**

తేది 5 ఆదివారం రాత్రి 2.10 గంటలకు సింహలగ్నాన వివాహ, గృహప్రవేశాలకు (తెల్లవారితే సోమవారం) తేది 6 సోమవారం పగలు 11.52గంటలకు మకర లగ్నాన వ్యాపార, గృహారంభాలకు తేది9 గురువారం పగలు 11.42 గంటలకు మకరలగ్నాన గృహారంభ, ఉపనయన, వ్యాపార, వివాహాలకు రాత్రి 11.04 గంటలకు కర్కాటక లగ్నాన గృహప్రవేశాలకు సుముహూర్తాలున్నవి.

**నవంబరు తిథులు**

**కార్తీక శుద్ధ**

తేది 4శని అష్టమి రా11.00గం.వ
తేది 5 ఆది నవమి రా12.50గం.వ
తేది 6 సోమ దశమి రా2.40 గం.వ
తేది7మంగళ ఏకాదశి రా3.45గం.వ
తేది 8బుధ ద్వాదశి రా 4.30గం.వ
తేది 9బేస్త త్రయోదశి రా4.32గం.వ
తేది 10శుక్రచతుర్దశి రా 4.10గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

### తుల

(చిత్త3,4పాదాలు,స్వాతి, విశాఖ1,2,3 పాదాలు)

ఆర్థిక పరిస్థితి బాగున్నా అసంతృప్తి కొనసాగుతుంది. కుటుంబ సభ్యులకు అనారోగ్యం కలుగవచ్చును. వారాంతంలో మిత్రులతో విభేదాలు రావచ్చును. బిడ్డల వల్ల కూడా మనస్సుకు బాధ ఉంటుంది. డబ్బు దుర్వినియోగం జరుగుతుంది. కుటుంబంలో శుభకార్యాల ప్రస్తావన ఉంటుంది.

### వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

గట్టి ప్రయత్నాలు జరిగితే గాని పనులు జరుగవు. ఆదాయం పరవాలేదు. ఆశపడినవి దూరం జరుగుతాయి. ఫలితం నిదానం. బంధువులతో మనస్పర్థలు. సన్నిహితుల సహకారం పొందడం, కొత్త వస్తువులు కొనడం జరుగుతుంది. ఉద్యోగులు సమస్యలు ఎదుర్కొనవలసి వుంటుంది. అధికారుల వల్ల ఆటంకాలుంటాయి. కొనవలసిన బాకీలుగాని, ప్రయత్నించిన అప్పులుగాని నిలబడి పోతాయి.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

స్థిరాస్తి అభివృద్ధి ఉంటుంది. ఆర్థికంగా బాగుండి ఆదాయం పెరుగుతుంది. పనులన్ని సకాలంలో జరుగుతాయి. అనుకోని సంఘటనలు జరుగవచ్చును. తగాదాలు, మనస్పర్థలు సర్దుకొని రాజీపడతారు. ఉద్యోగులకు అభివృద్ధి, స్థానమార్పు. శాస్త్ర సాంకేతిక రంగాల వారికి ఉద్యోగావకాశాలు, విదేశీయానం; కళా, సాహిత్య రంగాల వారికి సత్కారాలు జరుగవచ్చును. వారం మధ్యలో అనుకోని ప్రయాణాలు, కళత్ర వర్గానికి అనారోగ్య బాధలు, కొత్త వస్తు వాహనాలు, కొనడం జరుగుతుంది.

### మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఆదాయం పెరుగుతుంది. ఆర్థికంగా బలపడతారు. ఏ పనినైనా దిగ్విజయంగా జరుపుకొంటారు. విందు వినోదాలకు ఖర్చులు పెట్టగలరు. ఆరోగ్యం బాగుంటుంది. ఉద్యోగ నిర్వహణలో ఆటంకాలు తొలగిపోయి అధికారుల సహాయం పొందుతారు. సాంస్కృతిక రంగాల వారికి సత్కారాలు; శుభకార్యాల నిర్ణయం జరగడం జరుగుతుంది.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

అనుకున్న పనులు ఆటంకాలతో కొనసాగగలవు. వస్తు నష్టం జరుగగలదు. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం పెరుగుతుంది. ఆర్థికస్థితి బాగుంటుంది. ఋణాలు ఆలస్యం కాగలవు. అధికార వర్గం మీకు బాగా సహకరిస్తుంది.

### మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

డబ్బు, ఆస్తి వ్యవహారాలు చికాకును కలిగిస్తాయి. అనుకున్న పనులకు ఆటంకాలుంటాయి. ఆర్థికంగా సంతృప్తికరం. వృత్తి, వ్యాపార రంగాల వారికి ఆశించిన ఆదాయం ఉండదు. ఉద్యోగులకు అధికార వర్గంతో సామరస్యం బాగుంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది. వ్యవసాయ వర్గాలకు ఋణాలు అందవచ్చును.

---

## జనవాణి

3వ పేజీ కొరవ

హృదయాల్లో కలకాలం నిలిచి పోవడం ఖాయం.

నెల్లూరు జె.పోలిరెడ్డి

### మునిసిపల్ ఛైర్మన్ ధోరణి మార్చుకోవాలి

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్‌గా తాళ్లపాక అనూరాధ పదవీ ప్రమాణం చేసి ఆరు నెలలవుతున్నా ఇంత వరకు ఆమె చేసిన అభివృద్ధి పని ఒక్కటీ లేదు. నిత్యం రాజకీయ కక్షలు పెంచిపోషిస్తూ కాలక్షేపం చేస్తున్నారు. టిక్కెట్ ఇప్పించి, ఆర్థిక సహాయం చేసిన మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డిని వెన్నుపోటు పొడిచిన ఘనత సాధించారు. ఆమె తీసుకొన్న కొన్ని నిర్ణయాల వల్ల మునిసిపాలిటీ దివాలా తీసింది. తాజాగా మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందాని బాషాకు కోటమిట్టలోని షాదీ మంజిల్ అదనపు భవనాల ప్రారంభోత్సవ విషయంతో సంబంధం లేకపోయినా షోకాజ్ నోటీసు ఇప్పించారు. మునిసిపాలిటీలో మరో రాజకీయ సమస్య సృష్టించారు. ఛైర్మన్, కౌన్సిలర్లు గెల్చిన తర్వాత తమ పార్టీలు మరచి పోవాలి. ప్రజా సమస్యల పరిష్కారంపైనే దృష్టి సారించాలి.

నెల్లూరు షేక్ తాహిర్

### మంచినీళ్ల సమస్యను పరిష్కరించరా?

పెన్నానది ప్రక్కనే వున్న నెల్లూరు టౌన్‌లో నిత్యం మంచినీటి కరువే. వాటర్‌వర్క్స్ సెక్షన్‌లోని మోటార్లు రెండు వారాలకొకసారి చెడిపోతుంటాయి. వీటి రిపేర్లకు సంవత్సరానికి లక్షలాది రూపాయలు ఖర్చు పెడుతుంటారు. దీని బదులు కొత్త మోటార్లు కొనడమే మేలు. మంచినీటి సమస్య పరిష్కారానికి మునిసిపల్ కౌన్సిల్ ఎందుకు దృష్టి సారించడం లేదో అర్థం కావడం లేదు.

నెల్లూరు ఎస్.కరుణాకర్

### వెంకటేశ్వరపురంలో సమస్యల వెల్లువ

నెల్లూరు వెంకటేశ్వరపురం ప్రజలను పలు సమస్యలు పట్టి పీడిస్తున్నాయి. ఇక్కడి ఇస్లాంపేట, జై ఆంధ్రావీధి, జనార్దనరెడ్డి కాలనీ, అంబేద్కర్ నగర్, పాలడెయిరీ ప్రాంతాల్లో వీధిలైట్లు వెలగవు. మురుగు కాల్వలు శుభ్రపరచరు. దీంతో పగలు రాత్రి తేడా లేకుండా దోమలు స్వైర విహారం చేస్తుంటాయి. ముస్లింలు ఎక్కువ నివసించే ఈ ప్రాంతంలో పందులు ఎల్లకొల్లలు. పెన్నానది ప్రక్కనే వున్నా ఈ ప్రాంతపు కొళాయిల్లో మంచినీరు రానేరాదు. సమస్యలను మునిసిపాలిటీ దృష్టికి తీసుకువెళ్లినా పట్టించుకొనే అధికారి లేకుండా పోయాడు.

నెల్లూరు జైఆంధ్రాగౌస్‌మొహిద్దీన్

### పివి పాఠం తొలగింపు శ్రీహరి తొందరపాటు

మాజీ ప్రధాని పి.వి.నరసింహారావు జీవిత చరిత్ర విషయమై ప్రాథమిక పాఠశాలల పాఠ్యపుస్తకంలోని పాఠాన్ని వెంటనే తొలగించి పొరపాటు చేశారు. పి.వి. నరసింహారావుకు ప్రత్యేక కోర్టు విధించిన కేసు విషయమై ఆయనపై కోర్టుకు అప్పీలు చేశారు. దీని ఫలితం కొరకు ఎదురు చూడకుండా రాష్ట్ర ప్రాథమిక విద్యాశాఖా మంత్రి కడియం శ్రీహరి యిచ్చిన ఆదేశాలు రాజకీయ కక్ష సాధింపు చర్యేననాలి. పి.వి. బహుభాషా విజ్ఞానం, విపత్కర పరిస్థితులలో భారతదేశ పరిపాలనా సౌలభ్య స్ఫూర్తి, సృష్టించిన ఆర్థిక విధానాలు ప్రపంచ దేశాల ప్రశంసలు అందుకొన్నాయి. రాజకీయాల్లో నాయకులు ఎన్నో తప్పుడు పనులు చేయాల్సివస్తుంది. తప్పులు చేయని నాయకుడు భారతదేశంలో ఎవరైనా వున్నారా? తప్పులు వెదకడం ప్రారంభిస్తే జన్మభూమి పాఠాలు కూడా తొలగించవలసి వస్తుంది.

హైదరాబాద్ ప్రొఫెసర్ నాగరాజారావు

### పత్రిక అంటే ఇట్లా వుండాలి

అక్టోబర్ 20తేది జమీన్‌రైతు పత్రికలోని వార్తలు చూశాక ఆ ప్రతిని అందరికీ కొని పంచాలనిపించింది. ఎవ డబ్బు సొత్తని మసీదు స్థలం అమ్మడం, విద్యుత్ ఛార్జీలపై కోర్టు సైతం కరుణించలేదన్న సంపాదకీయం, అక్రమ బార్లపై ఎస్పీ లాఠీ, డ్రగ్ఇన్స్‌పెక్టర్‌కు ముదిరిన లంచాల దగ్గు వార్తలు చదువుతుంటే రోమాలు నిక్కబొడుచుకున్నాయి. జిల్లా వార్తల్లోని ఆడిట్ అధికార్ల అవినీతి కేళి, కోవూరు మార్కెట్ కమిటీపై వ్రాసిన వార్తలు మీ గుండె ధైర్యానికి సాక్ష్యాలు. ప్రజాస్వామ్యం కొంతమేరకైనా మనగలుగుతుందంటే దానికి జమీన్‌రైతు వంటి కొన్ని పత్రికలే కారణమనడం నిజం!

నెల్లూరు నెల్లూరుబాబు

### నమ్మశక్యంగాలేని ప్రకటనలు

99 అక్టోబర్ నెలలో గ్రామ ప్రాంత వాసులు 500 రూపాయలు చెల్లిస్తే ఫోన్ సౌకర్యం కల్పిస్తామని టెలికమ్యూనికేషన్ల శాఖ ప్రకటించింది. కొంత మందికి కనెక్షన్ ఇచ్చినా వీరివద్ద మరలా 1500 రూపాయలు అదనంగా వసూలు చేశారు. అంటే రెండు వేల రూపాయలకు ఫోన్ వచ్చిందన్న మాట. మళ్లీ టెలికమ్యూనికేషన్ల శాఖ ఈ మధ్య డిపాజిట్‌ను తగ్గిస్తున్నామని చెప్పి 500 రూపాయలు కడితే ఇంకేమీ కట్టనవసరం లేకుండా ఫోన్లు ఇస్తామంటున్నారు. ఈ ప్రకటనలో ఎంత మేరకు విశ్వసనీయత వుందో అర్థం కావడం లేదు. గత ఏడాది దరఖాస్తు చేసిన ఫోన్లకు ఇప్పటి వరకు కనెక్షన్లు ఇవ్వలేదు. ప్రభుత్వమే ఈ విధమైన గందరగోళ ప్రకటనలు చేయడం తప్పు.

రామన్నపాళెం ఎ.వాసుదేవశర్మ

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

మనుగడ వెళ్ల దీస్తున్న చిన్న దేశం టిబెట్టు! ఆ చిన్న దేశం నేటి ప్రపంచ పెద్ద రాజకీయాలకు ఒక గీటురాయిగా పరిణమించింది.

### నెల్లూరు ముచ్చట్లు

#### లంచాలు

లంచాల బాధ హెచ్చిపోయింది. మిన్నుముట్టిపోయింది. భూనభోంతరాళాలు దద్దరిల్లి పోయింది. ఏ మూల దిన్ను. ఏ ప్రక్క చూచినా లంచాలు లంచాలు అనే శబ్దం ప్రతిధ్వనించి పోతున్నది. నఖ శిఖ పర్యంతం, భూమ్యాకాశాల అవధిన క్రింద నుంచి పైదాకా పిపీలకాది బ్రహ్మ పర్యంతం, రోదసీ కుహరంబున సూది మోపను సందు లేక లంచాల నినాదాలే. లంచాల అపవాదాలే - లంచాల ఆరోపణలే కనిపిస్తున్నవి.

# వెంకయ్యనాయుడు

2వ పేజీ కొరవ

పేట ఎమ్మెల్యే నేదురుమల్లి జనార్ధనరెడ్డి ప్రసంగం హృద్యంగా వుండింది. వి.ఆర్ కాలేజికి వస్తే ఎన్నో తలపులు గుర్తుకు వస్తాయి. ఢిల్లీకి రాజైనా ఒక తల్లికి బిడ్డే అన్నట్లు వెంకయ్య నాయుడు మంత్రి అయినా స్వగ్రామం చవటపాళాన్ని మర్చిపోలేదన్నారు. ఆయన సిద్ధాంతం వేరు; నా సిద్ధాంతం వేరు. కాలేజి మమ్మల్ని ఒకే వేదిక మీదకు తెచ్చింది. పార్టీ వల్ల వెంకయ్య నాయుడు పెరగలేదు. ఆయన వ్యక్తిత్వం, క్రమశిక్షణ ముందుకు దూసుకపోయే తత్వమే ఆయన్ను ఇంత వాడ్ని చేశాయి. ఆంధ్రోద్యమం, ప్రజాస్వామ్య పునరుద్ధరణ ఉద్యమాలతో వెంకయ్య పెరిగాడు. వెంకయ్య ప్రతి పక్షంలో వుండి మమ్మల్ని వాయించి వదిలిపెట్టాడు. ఇప్పుడు ఛాన్సు మాకు ఇచ్చాడు. ఈ మధ్య పత్రికల్లో వెంకయ్య నాయుడు మంత్రిత్వం మీద వార్తలు వస్తున్నప్పుడు ఫోను చేసి ప్రోత్సహించాను. ఉదయగిరిలో వెంకయ్య వెలుగొండ ప్రాజెక్టును సాధించి పెడతానన్నాడు. ఇఫ్కోను కూడా ఆయన వదలకూడదు. సాధ్యం కానిది సాధించిపెట్టినప్పుడే వెంకయ్య ప్రతిభ బయటపడుతుంది. రాజకీయాలు ఎన్ని వున్నా ప్రజా సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని వెంకయ్య నాయుడికి సహాయ సహకారాలు అందిస్తామన్నారు.

వెంకయ్య నాయుడు ప్రసంగం సైతం తతిమా సభల్లో వలె ఊకదంపుడుగా కాక హృదయం నుంచి మాట్లాడినట్లుండింది.

ఈ వేదిక మీద నిలబడే ఎన్నో ఉద్యమాలు చేపట్టాను. రాజకీయంలో ఓనమాలు నేర్చింది వి.ఆర్.సిలోనేనన్నారు. కాలేజి ముందు ఒక గంగిరేను చెట్టు వుండేది. నిత్యం అక్కడే సమావేశమయ్యే వాళ్లం. ఇప్పుడు ఆ చెట్టు లేదు. దీంతో రాజకీయాల్లోకి వచ్చే విద్యార్థులు కూడా తగ్గిపోయారని వెంకయ్యనాయుడు చమత్కరించారు. మంత్రినవుతానని ఊహించలేదు. ఇంతకు ముందు పార్టీ ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తున్నప్పుడు హిందీలో 'మహామంత్రిజీ' అనేవారు. ఇప్పుడు 'మంత్రీజీ' అంటున్నారు. అంటే మంత్రి పదవి ప్రమోషనా; డిమోషనా అర్థం కావడం లేదన్నారు. 1985లో జమీన్‌రైతులో శ్రీరామమూర్తిగారు ఒక వార్త వ్రాస్తూ వెంకయ్య నాయుడులో ఏం ఆకర్షణ వుంది రోజూ పత్రికల్లో కన్పడడానికి అన్నారు. ఆకర్షణ నాలో లేదు; నేను ప్రజల మధ్య తిరిగే తీరులలో వుంది. ప్రజలతో కలసి వుంటే పత్రికలు ఎవర్నీ విస్మరించలేవు.

ప్రధానమంత్రి నాకు నచ్చిన శాఖ ఇచ్చారు. జనార్ధనరెడ్డి చేత పార్లమెంట్‌లో విమర్శింపబడే పరిస్థితులు తెచ్చుకోను. వ్యక్తిగతంగా తప్పులు జరగనివ్వనన్నారు.

గ్రామీణాభివృద్ధి శాఖ ద్వారా విద్యా, వైద్యం, రవాణా, కమ్యూనికేషన్ల రంగంలో మార్పు తెచ్చేందుకు కృషి చేస్తానన్నారు. ప్రజా జీవనంలో విలువలు కాపాడడంలో రాజీ పడనని. వి.ఆర్.సి.కి కావాల్సిన గ్రాంట్లు ఇప్పిస్తానని వాగ్దానం చేశారు. వెంకయ్య నాయుడ్ని పూర్వ విద్యార్థి సంఘం తరపున ఆనం భక్తవత్సలరెడ్డి సన్మానించారు. తనకు జరిగిన సన్మానానికి వెంకయ్య నాయుడు పులకించిపోయారు. అంతకు క్రితం కాలేజి కమిటీ అధ్యక్షుడు ఆనం రామనారాయణరెడ్డి - వెంకయ్య నాయుడి గారితో తనకు అసెంబ్లీలో గల సాన్నిహిత్యాన్ని ప్రస్తావించారు; కరస్పాండెంట్ వివేకానందరెడ్డి కాలేజి అభివృద్ధికి సాయపడమని విజ్ఞప్తి చేశారు. పూర్వ విద్యార్థుల పక్షాన నెల్లూరు దోలేంద్ర ప్రసాద్ స్వాగత వందనాలు చెప్పారు.

***

చివరి కార్యక్రమం మునిసిపల్ పౌరసన్మానం; ఈ సభకు ఎందుకు వప్పుకున్నానా అని వెంకయ్య నాయుడు చెంపలేసుకొనే పరిస్థితి కల్పించారు మునిసిపల్ పాలకులు. అంతా అబందరే; ఒక పద్ధతి పాడు లేదు; వేదికపై ఎక్కేవారిపై అదుపులేదు; మైకు ఎవరికి దొరికితే వారిష్టం వచ్చిన ఉపన్యాసాలు; మధ్య మధ్యలో అరుపులు, కేకలు, త్రోపులాటలు. ఛైర్మన్ మాట ఒక్కరూ వినలేదు. కౌన్సిలర్ కిలారి వెంకటస్వామి నాయుడు ఉన్నట్టుండి వేదికెక్కి ఆత్మకూరు ఎమ్మెల్యే కృష్ణయ్యకు సన్మానం చేయను మొదలెట్టాడు. కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తీసుకొచ్చిన చప్పట్ల గుంపుతో ఒకటే గొడవ. వేదిక మొత్తానికి 'మునిసిపాలిటీ' అనిపించింది. ముఖం కందగడ్డ అయిందంటే నమ్మండి! సన్మానమయ్యాక మాట్లాడుతూ ప్రజాజీవనంలో క్రమశిక్షణ లోపిస్తున్నది. అభిమానం పరిధి దాటి దురభిమానంగా మారకూడదు. నాకు చిన్న నాటి నుంచి క్రమశిక్షణ అలవాటు. జరిగిపోయిందేదో జరిగిపోయింది. నాయకులనే వారు పదిమందికీ ఆదర్శంగా వుండాలని మునిసిపల్ నాయకులకు హితబోధ చేశారాయన. మునిసిపాలిటీలోని నాయకులు విధులు, నిధులు సక్రమంగా ప్రజల కోసం వినియోగించాలి. తగవులొద్దు - తంటాలొద్దు. మునిసిపల్ ఆదాయాన్ని పెంచేందుకు కృషి చేయండని హితవు చెప్పారు. మునిసిపల్ ఛైర్మన్ తాళ్లపాక అనూరాధ సమస్యల చిట్టా విప్పారు. నెల్లూరు తూర్పు ప్రాంతవాసుల దాహార్తి తీర్చను హడ్కో సంస్థ 9 కోట్లు మంజూరు చేసింది. కాని ఆ నిధులు ఇంకా రాలేదు. అండర్ గ్రౌండ్ డ్రైనేజి స్కీమ్‌కు 100 కోట్లు కావాలి. కండలేరు నుంచి మంచినీటిని తేవాలి. చిన్నబజారు, పెద్దబజారు, రంగనాయకులపేట, సింహపురి హోటల్ రోడ్లు అధ్వాన్నం - వీటికి నిధులు కావాలి. టౌన్‌లో సెంట్రల్ లైటింగ్ సిస్టమ్‌కు సహకరించమన్నారు. నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ స్థానిక సంస్థలకు పూర్తి అధికారాలివ్వండి. ఎం.ఎస్.డి.పి., ఎస్.జె.ఆర్.వై. నిధులు నేరుగా మునిసిపాలిటీలకివ్వండి. రాష్ట్రంలోనే నెల్లూరు పెద్ద మునిసిపాలిటి. దీన్ని కార్పొరేషన్ చెయ్యమన్నారు. ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య సోమశిల ప్రాజెక్టుకు ప్రస్తుతం 150 కోట్లు ఖర్చు పెడితే 800 కోట్ల రూపాయల ధాన్యం ఉత్పత్తి పెరుగుతుందన్నారు. వైస్ ఛైర్మన్ సందానిబాషా మాట్లాడుతూ లే అవుట్లు రెగ్యులరైజేషన్ చేసే అధికారం మునిసిపాలిటీకిస్తే 5 కోట్ల రూపాయలు మిగులుతుందన్నారు. కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ మాట్లాడుతూ వెంకయ్య నాయుడు సూచనల మేరకు జిల్లా అభివృద్ధి విషయమై ఒక బ్లూ ప్రింట్‌ను తయారు చేస్తున్నట్లు చెప్పారు. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మాట్లాడుతూ వెంకయ్య నాయుడు పదవికి ఆనందపడని నెల్లూరీయుడు లేడన్నారు.

## పథకాలన్నీ కేంద్రానివే

రాష్ట్ర ప్రభుత్వం అమలు పరుస్తున్న మెజార్టీ సంక్షేమ పథకాలు కేంద్ర ప్రభుత్వం నిధులతో నడుస్తున్నవని కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి ముప్పవరపు వెంకయ్య నాయుడు చెప్పారు. 31తేది నెల్లూరు రోడ్లు, భవనాల శాఖ అతిథి గృహంలో విలేఖరులతో ముచ్చటించారు. గ్రామీణాభివృద్ధి శాఖ అమలు పర్చే ప్రతి పథకంపై అవగాహన కల్గించేందుకు దేశంలో ప్రతి సర్పంచ్‌కు ఉత్తరాలు రాస్తానని చెప్పారు. కేంద్రం విడుదల చేసే100 రూపాయల నిధుల్లో 15శాతం కూడా పేద ప్రజలకు చేరడం లేదని మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీ గతంలో వ్యాఖ్యానించారని, తన హయాంలో కనీసం 60 రూపాయలైనా అందే ప్రయత్నం చేస్తానన్నారు.

## మహిళల్లో చైతన్యం వెల్లి విరుస్తూంది

భారతీయ జనతాపార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత మహిళలకు పూర్తి స్వేచ్ఛ లభించిందని కేంద్ర సమాచార, ప్రసార శాఖల మంత్రి సుష్మాస్వరాజ్ చెప్పారు. 31తేది రోడ్లు భవనాల అతిథి గృహంలో తనను కలవటానికి వచ్చిన మహిళలను ఉద్దేశించి మాట్లాడారు. బిజెపి అధికారంలోకి వచ్చాక రాజకీయ సభలకు మహిళలు పెద్ద ఎత్తున తరలి వస్తున్నారు. దీనికి కారణం 33శాతం మహిళా రిజర్వేషన్. మహిళలు అక్షరాస్యులైనప్పుడు సగం సమస్యలు పరిష్కారమవుతాయని సుష్మాస్వరాజ్ అభిప్రాయపడ్డారు.

# ఉలికిపాటు

4వ పేజీ కొరవ

శోచనీయమని కూడా అన్నాడు. ఆ వ్యాఖ్యకు అక్కడున్నవారంతా ఉలిక్కిపడి ముఖాలు చూసుకోవడం కన్పించింది. ఇదెక్కడికి దారితీసి తన పీకకు చుట్టుకుంటుందోనని భయపడి పాపం డిసిసి అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి తత్తరపడిపోయాడు.

# చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

అతని కుమారుడు పట్టాభి (శ్రీకాంత్) ఆర్టీసి బస్సు కండక్టరుగా పనిచేస్తుంటాడు. భార్య కలవారి ఇళ్లల్లో పని చేస్తుంది. మరో ఇద్దరు కూరగాయలమ్మి ఇతర పనులు చేస్తుంటారు. ఇలా అందరూ సంపాదిస్తూ, కొంత మిగుల్చుకొంటూ సుఖంగా జీవిస్తుంటారు. పట్టాభి గాయత్రిని ప్రేమిస్తాడు. వారి ప్రేమ సరదాగా సాగి పోతుంది.

కుటుంబ నియంత్రణ పాటిస్తూ, కుటుంబంలోని సభ్యులంతా పనిచేసి సంపాదిస్తూ, పొదుపును అనుసరిస్తూ వుంటే ఏ మధ్య తరగతి కుటుంబంలో సుఖశాంతులతో జీవించవచ్చు. లేకుంటే



వి.ఆర్. కాలేజిలో గజమాలతో వెంకయ్య నాయుడ్ని సన్మానిస్తున్న అభిమానులు. ప్రక్కన హైదరాబాద్ అభిరుచి హోటల్ అధినేత బాబుల్ రెడ్డి.

గోవిందరావు కుటుంబంలా కష్టాలపాలు కావాల్సి వస్తుందన్న సందేశాన్ని చిత్రం అందిస్తుంది. తెలుగు సినిమాకు ఈ అంశాలు కొత్తేమీ కాదు. ఈ పాత విషయాలను దర్శకుడు కొత్త మార్గంలో చూపాడు. ప్రతి పాత్రను పట్టుగా నడిపాడు. ప్రతి సన్నివేశాన్ని ఆకట్టుకునే రీతిలో తీర్చాడు. చిత్రమంతా దర్శకుని ప్రతిభా పాటవాలు ప్రతిబింబించాయి. అందు వల్లే చిత్రం చూడ బుద్ధిపుట్టుంది. ఇది దర్శకుని చిత్రంగా చెప్పాలి.

జనార్ధన మహర్షి మాటల్లో చిత్రానికి మంచి ఊపు నిచ్చాయి. వందేమాతరం శ్రీనివాస్ సంగీతం ఇంపుగా లేదు. ఇంత వరకు హాస్యపాత్రల్లో ప్రేక్షకులను అలరిస్తుండిన ఎల్‌బి. శ్రీరాం ఈ పర్యాయం బాధ్యతల భారంతో నిండిన గోవిందరావు పాత్రలో విషాదంతో ఏడిపించాడు. చిత్రానికంతా గుర్తుండే నటన కనుపరిచాడు. మిగతా నటీనటులంతా బాగా నటించారు.

# నెల్లూరుసంగతులు

4వ పేజీ కొరవ

ఎన్. హరిప్రసాద్ రెండవ స్థానం, బి. మురళీకృష్ణ మూడవ స్థానం, 70 కేజీల బరువు విభాగంలో పి. ఉదయభాస్కర్ రెండవ స్థానం పొందారు. గ్రీన్‌బెల్ట్ డివిజన్‌లో ఎ. మురళీ, బ్లాక్ బెల్ట్ డివిజన్ నందు టీమ్‌కట్టాలో రెండవ స్థానాన్ని బి. మురళీకృష్ణ, ఎన్. హరిప్రసాద్, ఎస్. హరికృష్ణ సాధించారు. నెల్లూరు నుంచి వెళ్లిన జట్టు ఓవరాల్ ఛాంపియన్ షిప్‌ను కూడా కైవసం చేసుకొందని శిక్షకుడు వి.శ్రీనివాసులు చెప్పారు.

## లైఫ్ సర్టిఫికేట్ జత చేయండి

ప్రభుత్వ ఫించను పొందుతున్న ఫించనుదార్లు తాము ఫించన్ పొందే ఉపఖజానాధికారికి లైఫ్ సర్టిఫికేట్ సమర్పించాలని జిల్లా ఖజానాధికారి కోరుతున్నారు. ఈ సర్టిఫికేట్ ఈ నెలాఖరులోగా సమర్పించకుంటే డిసెంబర్ నెలలో ఫించన్ చెల్లించమంటున్నారాయన.

## అంధుల జాతీయ చదరంగ పోటీలు

రోటరీ క్లబ్ నెల్లూరు సౌత్ నేతృత్వంలో జరిగిన అంధుల జాతీయ చదరంగ పోటీలు నాలుగు రోజులపాటు ఘనంగా జరిగాయి. చివరిరోజైన 1తేది ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ముఖ్యఅతిథిగా విచ్చేసి బహుమతులు పంచిపెట్టారు. ఈ సందర్భంగా జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయరామిరెడ్డి, మెట్రోస్ క్లబ్ కార్యదర్శి మెట్టా చంద్రశేఖరరెడ్డి పాల్గొన్నారు. ఈ పోటీలకు మోడరన్ స్కూల్ విజయకుమార్‌రెడ్డి, కె.వి.రవీంద్రరెడ్డి, ఎమ్మార్ సుబ్బారెడ్డి, కృష్ణమూర్తి, చంద్రభవన్ రాజా, బెజవాడ నరేష్‌చంద్రారెడ్డి, సహాయ సహకారాలు అందించినట్లు క్లబ్ కార్యదర్శి మక్కెన అంకయ్య చౌదరి చెప్పారు. పోటీల్లో విజేతలుగా మహారాష్ట్రకు చెందిన విలేష్‌భట్, శిరీష్‌పటేల్, స్వాన్ నిలేష్, రాజేష్ ఓనేహ, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సిద్దయ్య, తమిళనాడుకు చెందిన ముత్తురామన్ నిలిచారు.

## కొత్తదారిలో ప్రభుత్వం

రాష్ట్ర అవతరణ దినోత్సవ వేడుకలు 1తేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో సాదాసీదాగా జరిగాయి. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి జాతీయ పతాకాన్ని ఆవిష్కరించి పోలీసు వందనం స్వీకరించి మాట్లాడారు. రాష్ట్రంలో పరిపాలన కొత్తదారిలో నడుస్తుంది. పనిద్వారా ప్రగతిని సాధించాలన్న ఆలోచన అందరిలో వుండాలని ప్రభుత్వం గట్టిగా నమ్ముతుంది. చేసిన ప్రతి పనిలోనూ పారదర్శకత తోపాటు నీతి, నిజాయితీ గల పరిపాలనా విధానాన్ని అందించాలన్నది ముఖ్యమంత్రి ఆశయం. ప్రజలంతా ప్రభుత్వ పథకాల్లో భాగస్వాములు కావడం, చైతన్యవంతమైన స్ఫూర్తిని పొంది ప్రభుత్వ పథకాలను సద్వినియోగం చేసుకోవడం అవసరం. జిల్లాలోని అన్ని ప్రాంతాలను అభివృద్ధి చేసుకోవడానికి జన్మభూమి కార్యక్రమం ఒక వరంలా పరిణమించింది. జన్మభూమి కార్యక్రమం క్రింద జిల్లాలో 118 కోట్ల రూపాయల విలువైన 6760 పనులు మంజూరుకాగా ఇంత వరకు 105 కోట్ల 69 లక్షల రూపాయల విలువైన 6413 పనులు పూర్తయ్యాయి. ఈ పథక నిర్వహణలో జిల్లా రాష్ట్రంలోనే ప్రథమ స్థానంలో నిలచిందన్నారు. జిల్లాలో ఇంత వరకు 179 కోట్ల ఖర్చు పెట్టి 1,66,247 గృహాలు కట్టారు. చిన్న మొత్తాల పొదుపులో జిల్లా లక్ష్యం 60 కోట్లు కాగా 68 కోట్లు సాధించిందన్నారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ ప్రవీణ్ కుమార్, ఎస్పీ శ్రీనివాసరెడ్డి, ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి, కృష్ణయ్య, వంటేరు వేణుగోపాలరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

Registered : RN 1156 / 57
No. A.P. / VJA / 52 / 8 / 2000


## స్కాంపి రొయ్యలు

మొదటి పేజీ తరువాయి

తమంతట తాముగా సృష్టిస్తున్న ఈ విధ్వంసాన్ని తప్పు పట్టడానికి లేదు; అడ్డంతరపెట్టే అధికారం ఎవరికి లేదు.

అయితే ఈ మార్పు రైతాంగాన్ని ఎక్కడకు నడిపిస్తుంది? రైతుకు నిజంగానే మేలు చేస్తుందా, లేక భ్రమలు సృష్టించి ఇక్కట్ల పాలు చేస్తుందా అన్న ప్రశ్నలకు సమాధానాలు వెతకడం మాత్రం అవసరం. మొత్తం పరిస్థితిని ఆర్థిక దృక్కోణంలో, శాస్త్రీయంగా విశ్లేషణ చేయడం ముఖ్యం అంతా. అనుకున్నట్టు సవ్యంగా జరిగితే రొయ్యల పెంపకం రైతు బ్రతుకు తీరును మేలిమలుపు త్రిప్పుతుందనడంలో సందేహం లేదు. అయితే సవ్యంగా జరగేందుకు అవకాశాలెన్ని అన్నదే ప్రశ్న; జరగలేదంటే పరిస్థితి ఏమిటి అన్నది సందేహం.

నాటు పద్ధతిలో లెక్కవేస్తే - ఒక ఎకరాకు 8వేల వరకు పిల్లలు వదిలి పెడుతున్నారు రైతులు; అందులో 60 శాతం వరకు బ్రతికి సగటున 50 గ్రాముల బరువుకు పెరిగితే దాదాపు 300 కిలోల దిగుబడి వస్తుంది. తక్కువలో తక్కువగా కిలో రు 300లకు ధర పల్కితే 90వేల రూపాయల రాబడి. ఇందులో పిల్లల ఖర్చు - దాదాపు 10వేలు; మేత పాతికవేలు; కరెంట్ ఛార్జీలు రమారమి 10వేలు; ఇతర యాజమాన్య వ్యయం, పెట్టుబడిపై వడ్డీలు కలిపి - మరొక 10వేలు. మొత్తం మీద 50 నుంచి 60 వేల వరకు ఖర్చయినా రైతులు ఎకరాకు కనీసం 30వేలకు పైబడి లాభం వస్తుంది. అదృష్టం బాగుంటే ఇంకా ఎక్కువ రావచ్చు. వరి సాగులో ఈ మాత్రం ఆదాయ వూహకు కూడా అందని విషయం. అందుకే రైతుల్లో అంతటి వేలం వెర్రి.

ఇప్పటి వరకు రైతులు లాభం తప్ప ఇందులోని సమస్యల గురించి ఆలోచించడం లేదు. ఇంత వరకు చెప్పుకోదగిన సమస్యలేవీ అనుభవానికి రాకపోవడమే అందుకు కారణం. అయితే జీవంతో వున్న ఏ జీవితో, వ్యాపారం చేసినా సమస్యలనేవి తప్పవన్నది గుర్తుంచుకోవల్సిన సత్యం. బ్రైలు, కోళ్లు, ఉప్పునీటి రొయ్యలు వంటి వాటన్నింటిలో ఇది మనకు అనుభవమే.

ఇప్పటి స్కాంపి రొయ్యల్లో కన్పిస్తున్న ప్రధాన సమస్యలు రెండు - పిల్లల సరఫరా, మార్కెట్ నిలకడ! జిల్లాలో సాగులో వున్న విస్తీర్ణానికి సరిపడే హేచరీలే లేవు ఇప్పుడు; సాగు రెట్టింపు అయితే పిల్లల సరఫరా దుర్లభమౌతుంది. ఈ కొరతను ఆసరాగా తీసుకొని హేచరీ యాజమాన్యాలు మోసాలకు పాల్పడుతున్నాయి. విదేశాల నుంచి నాణ్యత లేని పిల్లల దిగుమతి; కాలువల్లో దొరకే స్థానిక రకం పిల్లలను హేచరీ ఉత్పత్తిగా అమ్మడం వంటివి చేస్తున్నారు. దీనివల్లరైతుకు రెండందాల దెబ్బ. మొదటిది డబ్బు నష్టం - పదెకరాల రైతు కూడా లక్ష రూపాయల వరకు కోల్పోతున్నాడు; రెండవది సమయ నష్టం. హేచరీల చుట్టూ తిరగడానికి రెండు నెలలు. నర్సరీలో పెంపకానికి రెండు నెలలు కనీసం సమయం పడుతున్నది; పిల్లల్లో నాణ్యత లోపిస్తే మళ్లీ ఈ నాలుగు నెలల సైకిల్ తప్పదు. అప్పటి వరు చెరువులు ఖాళీ; రైతుకు తెలియని నష్టం ఇది.

అంతర్జాతీయ మార్కెట్ అత్యంత ప్రమాదకారి. బ్లాక్ టైగర్ రొయ్యల విషయంలో పలుమార్లు రుజువైన నిజం అది. జపాన్, అమెరికా వంటి దేశాలలోని వ్యాపారులు అదను చూసి దెబ్బకొట్టడంలో అత్యంత నిపుణులు. మార్కెట్‌లో ధర తగ్గిది పరిస్థితి ఏమిటి, ఎంత వరకు తగ్గితే కోలుకోగలం అన్న ఆలోచన రైతులలో ముందు నుంచే వుండడం అవసరం.

తెగుళ్లు రావు అన్న భరోసా ఎంత మాత్రం మంచిది కాదు. ప్రాణం అనేది వుంటే రోగం తప్పదు. రొయ్య ఎట్లా వుంటుందో చూసి కూడా ఎరుగని రైతులు ఈ సాగులోకి వస్తున్నారు. వ్యాధుల సమస్య ఎదురైతే - వారి అమాయకత్వాన్ని తమ లాభంగా మల్చుకోజూసే దగాకోరులు రెడీగా వుంటారు. రొయ్యల పెంపకం చేపట్టే ప్రతి రైతూ - అనుభవజ్ఞులైన వారి నుంచి కాని, శాస్త్రవేత్తల నుంచి కాని కనీసపాటి విషయ పరిజ్ఞానం తెలుసుకోవడం చాలా చాలా అవసరం.

అసలు జిల్లాలో వ్యవసాయ రంగం ఇంతగా పెనుమార్పులకు గురౌతుంటే మత్స్యశాఖ కాని, వ్యవసాయ శాఖకాని ఏంత మాత్రం చలించక పోవడం విచారకరం. రైతులు మమ్మల్ని అడిగి చేస్తున్నారా అన్న నిరసన ధ్వని విన్పిస్తున్నది. అది సమంజసం కాదు. రైతులు ఎప్పుడూ, ఎవర్నీ అడగనవసరం లేదు. అధికారులే రైతుల వద్దకు వెళ్లి సూచనలివ్వాలి. అది వారి కనీస బాధ్యత. అధికారులు తక్షణం స్పందించి జిల్లా వ్యాప్తంగా రైతులకు ఈ నూతన వ్యవసాయ ప్రక్రియపై అవగాహన పెంచడానికి సదస్సులు నిర్వహించడం అవసరం. పెంపకంలోని మెళకువలు, తెగుళ్లు సూచనలు, నివారణ చర్యలు, వాడవలసిన మందులు వాడకూడని రసాయనాలు, మార్కెట్ పోకడలు వంటి వాటిపై రైతులకు శాస్త్రీయ సమాచారం అందించకపోతే భవిష్యత్తులో చాలా అనర్థాలు జరుగుతాయి. వరి సేద్యంలో తుఫాను వల్లనో, మరొక కారణంతోనో నష్టం వస్తే కోలుకొనే వీలుంటుంది; కాని రొయ్యల పెంపకంలోని పెట్టుబడి నష్టం జరిగితే కోలుకోవడం అసాధ్యం. పొలం ధరకు మించి పెట్టుబడి పెడుతున్నాడు; ప్రమాదం జరిగి హాహాకారాలు చెలరేగక ముందే ప్రభుత్వం తగిన ముందు జాగ్రత్త చర్యలు చేపట్టాలి.







## ముఖ్యమంత్రి

మొదటి పేజీ తరువాయి

లారీలకెక్కించి, రాత్రికి రాత్రి నగరానికి దూరంగా వదిలేశారు. నర్మద వంటి ప్రాజెక్టులలో నిర్వాసితులకు సకల సదుపాయాలూ కల్పిస్తున్నా పౌరహక్కుల సంఘాలు ప్రభుత్వం కాళ్లు, చేతులు కట్టిపడేస్తున్నాయి. నగం నగరాన్ని ఖాళీ చేయించడం భారతదేశంలో ఎప్పటికైనా సాధ్యమా?

చైనాతో ఇండియాను పోలిస్తే, చైనాలో వలె ఆర్థిక సంస్కరణలు తానూ అమలు చేస్తానని ముఖ్యమంత్రి చెప్తుంటే వినడానికి కర్ణకఠోరంగా వుంది. ముఖ్యమంత్రి ఎందుకు ఇట్లా మాట్లాడు తున్నాడు, ప్రవర్తిస్తున్నాడో అర్థమే కావడం లేదు. రాష్ట్రంలో పరిపాలన మానేసి హరికథలతో పురాణ కాలక్షేపం చేయచూస్తున్నాడు ముఖ్యమంత్రి. దాదాపు ఆరుకోట్ల వ్యయమైంది - చంద్రబాబు జపాన్, చైనా దేశాల పర్యటనలకు. కాని అరకోటి మేర కూడా విదేశీ పెట్టుబడి సాధించలేక పోయారు. ఇంతకు క్రితం జరిపిన అమెరికా, మలేషియా పర్యటనల విషయమూ అంతే!

రాష్ట్రంలో ఏమీ చేయడం లేదని జనం పెదవి విరవకుండా ఇటువంటి మాయమాటలు, కల్పిత గాథలు సృష్టించి ప్రజలను మభ్య పెట్టడానికి ప్రయత్నిస్తున్నట్లున్నాడు చంద్రబాబు. నిజానికి రాష్ట్రానికి ఇప్పుడు కావలసింది చైనా మైకం కాదు - ప్రజలకు బ్రతుకు జీవనం. రాష్ట్రంలో ఆర్థిక పరిస్థితులు దారుణంగా వున్నాయి. ప్రభుత్వం కేవలం ఉద్యోగులకు జీతాలు ఇవ్వడం తప్ప మరే పనీ చేయడం లేదు. ఎక్కడి అభివృద్ధి కార్యక్రమాలు అక్కడ నిల్చిపోయి వున్నాయి. నవంబరు నెలలోనే కరెంట్ కొరత ఏర్పడి వుంది. వరి సేద్యం వద్దని ప్రభుత్వం రైతులకు సలహా ఇచ్చే దౌర్భాగ్యం ఏర్పడి వుంది. ఇంకొక ప్రక్క వాగాకు క్రాప్ హాలిడే ప్రకటించారు; పత్తి, వేరుశనగ పైర్లు వేయవద్దని హెచ్చరించారు. ప్రభుత్వం ఎంత అయోమయంలో వుందో, ఎంత చేతకాని స్థితిలో వుందో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

రాష్ట్రంలో పారిశ్రామిక రంగం పరిస్థితి అంతే. ప్రభుత్వం వరుసబెట్టి ఉన్న పరిశ్రమలు మూసుకొంటూ పోవడం తప్ప కొత్తవి స్థాపించే యోచనే చేయడం లేదు. దానితో రాష్ట్రంలో నిరుద్యోగం అదుపు తప్పుతున్నది. ఒక్క కొత్త ఉద్యోగం సృష్టించే సూచనలు కన్పించడం లేదు.

ఏమీ చేతకాక, ఏమీ చేయలేక ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ గురించి వూదరగొడుతున్నాడు ముఖ్యమంత్రి. కంప్యూటర్ల విషయంలో ప్రభుత్వ పరంగా చేయవలసిన, చేయదగిన పని ఏదీ లేదు. ఒక్క రూపాయి పెట్టుబడి పెట్టి ఒక్క సంస్థను స్థాపించవవసరం లేదు. కేవలం పత్రికా ప్రకటనలు ఇస్తూ వెళ్తే చాలు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి సంబంధించిన సంస్థలు, వ్యాపారం, పురోగతి సమస్తం ప్రైవేటు వ్యక్తులపై ఆధారపడి వుంది. అయితే కొత్త కంప్యూటర్ సంస్థలు ఎన్ని ఏర్పడినా రాష్ట్రంలో నిరుద్యోగ సమస్య తీరదు; రాష్ట్రం ఆదాయం పెరగదు; ప్రజల జీవన ప్రమాణంలో మార్పు రాదు.

కంప్యూటర్ల పేరుతో ఊక దంపుడు ఉపన్యాసాలే కాదు - ప్రభుత్వ ధన దుబారా సైతం అపరిమితంగా వుంది. ముఖ్యమంత్రికి ప్రతిరోజూ పత్రికల వార్తలు సంక్షిప్తంగా చదివే సౌకర్యం కల్పించడం కోసం 25 లక్షలతో ఒక సాఫ్ట్‌వేర్ తయారు చేస్తున్నారు. దీని పని సంక్షిప్తంగా వార్తలు కంప్యూటర్ స్క్రీన్‌పై కన్పడేటట్లు చేయడం; ఇప్పుడు కొత్తగా మరొక సాఫ్ట్‌వేర్ తయారీకి ఆర్డరు చేశారు; దీని పని సంక్షిప్తంగా వుండే వార్తలు కావాలనుకుంటే పూర్తి పాఠం కంప్యూటర్ తెరపై కన్పించేట్లు చేయడం. దీని కోసం 75లక్షల రూపాయల కాంట్రాక్టు ఇచ్చారు. ప్రభుత్వం తరఫున నడపదలచిన కొత్త టివి ఛానళ్లకోసం 200 కోట్ల రూపాయల పథకం సిద్ధం చేసింది రాష్ట్ర ప్రభుత్వం. రాష్ట్రంలో ఆత్మహత్యలు చేసుకొన్న రైతు కుటుంబాలకు ఆర్థిక సహాయం అందించడానికి డబ్బు లేదని దివాలాతనం ప్రదర్శిస్తున్న రాష్ట్ర ప్రభుత్వానికి రెండు వందల కోట్ల పెట్టుబడితో టివి ఛానళ్లు పెట్టవలసిన అవసరం వుందా? పత్రికలు చదవడానికి కోటి వెచ్చించాలా? ఇదొక్క టేకారు - ప్రాధాన్యతల నిర్ణయంలో ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు ప్రమాదకరంగా మారుతున్నది. ప్రజల అవసరాలు, భవిష్యత్, రాష్ట్ర శ్రేయస్సు ప్రక్కన పెట్టి కేవలం ప్రచారాలకు, వ్యక్తిగత ఇమేజ్ సృష్టికి, రాజకీయ మాయదారితనానికి వందలు వేల కోట్లు దుబారా చేయడం ఎంత అన్యాయం? ప్రభుత్వం తిరుమారకుంటే, తప్పులు సరిదిద్దుకోకుంటే ముఖ్యమంత్రికి చైనా మైకం మాత్రం మిగులుతుంది; ప్రజల భవిష్యత్ అంధకార బంధురమౌతుంది.

... Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.